...త్సర చందా
12-0-0
...పత్రిక 4 అ.


Fou...

జయ ...




...నన౦: 1867 సం॥ నిర్యాణం: 1938 సం॥

## దేశోద్ధారకుని వర్ధంతి

### చైత్ర శుద్ధ ద్వాదశి, ఏప్రిల్ 14

ఉండె నొకప్పు డాంధ్రమహీ
  మజ్జ్వలతేజు డుదారభావు డా
తం డతిపుణ్యమూర్తి యని
  తండ్రులు చెప్పగ చిట్టిపాపలున్
నిండిన పండువెన్నెలల
  నీడగు నత్కథ లాలకించుచున్
పండుకొనంగ సెజ్జలను
  భావన సేతురు స్వప్నలీలలన్.

తులుగారు

అధుని కాంధ్ర ... రావుగారి జీవితము ఒక ... అటువంటి మహాపురుషులు నప్పుడు ఆదర్శముల నేవి ప్రత్యక్ష నిదర్శ లవుతాయి. ఆదర్శముల నేవి అమావాస్య చీకటిరాత్రియందు అంతరిక్షములోని నక్షత్రములవలె మిణుకుమిణుకుమని మెరుస్తూ ఉంటాయి. కాని, నిండు పండువెన్నెలతో చంద్రుడు ప్రకాశించునప్పుడు, పూర్ణిమరాత్రి యందు రాజనీరాజన తేజము వెల్లివిరియు చున్నప్పుడు, ఆదర్శప్రాయములైన నక్షత్రములు ఆ వెన్నెలలో చిన్నబోయినట్లుగా, ఆ వెన్నెలలో లీనమైపోయినట్లుగా, మింట నుండియు కంటికి కనుపడవు. నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రజాతియ నెడిపాల్కడలి యందు పొడమిన కళాప్రపూర్ణుడు. ఆంధ్ర దేశంలో ఎక్కడ ఏ సదుద్యమము సంకల్పింపబడినప్పటికీ, దేశోద్ధారకుని యాశీ

... అధ్యక్షు ... చేరి నప్పటికీ, ఎన్ని ... ను, స్వర్గములో కూడా లేని సాహ ... సద్భావ సాహచర్య సహకారములతో సభ ... సర్వ జన రంజకమై కళకళలాడుతూ ఉండేవల సినదే. ఆయన రథసారథియై కూర్చున్నప్పుడు దుర్జనులు నోరెత్తలేదు. అర్జున విషాదమున కవకాశము లేదు. గీతాసారమును మననముచేసి, దానిని ఆత్మజీవిత ప్రసాదముగా ఆంధ్రలోకమునకు సమర్పించిన యుగపురుషుడు—నిష్కామ కర్మయోగి.

నాగేశ్వరరావు పంతులుగారి జీవితం ఆంధ్రజాతికి జాతీయగీతం కాదగినంత రసవంతం - స్వయంకృషి చేసిన కష్టజీవి— లక్షలు గడించిన నిరాడంబరజీవి. దానము ఆయన జీవితవిధానము. ఆంధ్రజాతికి ఆ మహాపురుషుడు పెన్నిధానము. మహారాజునైన చిన్నబుచ్చెడి మహాత్యాగము. ఆయన పట్టినది బంగారము - ఆయన పెట్టినది ప్రయాగ. ఆయన కొలువుదీర్చిన తావు విద్యలకు నెలవు. నాగేశ్వరరావుగారు గడించిన గౌరవాతిశయము ఆంధ్రుల పూర్వపుణ్య విశేషము.

ఆంధ్రులకు గౌరవం ఆయన పెట్టినభిక్ష. "ఉత్తరాదిబ్రాండ్లకు అన్నము వేయబడును" అని మద్రాసునగర క్షుద్రభావులు ఆంధ్రుల నుద్దేశించిన వికట ప్రకటన పదప్రయోగములు గోడలమీదను బల్లలమీదను ప్రత్యక్షమైన కాలములో, పంతులుగారు బొంబాయినుంచి మద్రాసుకువచ్చి (1914 సం॥లో) ఆంధ్ర దినపత్రికను ప్రకటింప నారంభించిరి. అదిమొదలుగా, పంతులుగారు మద్రాసులోని తమ ముద్రాణలయముతో "ఆంధ్ర" శబ్దమునకు ఆత్మగౌరవ ముద్ర వేశారు. ఈనాడు ఆంధ్రులు పూర్తిగా ఆత్మసాక్షాత్కారమునుపొందలేము ఆత్మశక్తిని అమాలాగ్రముగా గ్రహింపక పోవచ్చు. కాని, యీ ఆత్మోపలబ్ధికి కావలసిన ఉపదేశములుచేసి, అక్షరాభ్యాసము చేసిన ఆంధ్రజాతి గురువు నాగేశ్వరరావు గారు. "సిద్ధంనమః" యని ఆంధ్రజాతి ఆ

కల్పసిద్ధుని స్మరించి నమస్కరించవలసిన పవిత్ర దినము నేడు. నాగేశ్వరరావుగారు తమ భౌతిక దేహమును వీడి నేటికి (శుద్ధ ద్వాదశికి) 16 సంవత్సరములుగడచి ...

ఆంధ్రలోక విజ్ఞానమునెడి మహాస్రవంతము సర్వజన లభ్యమగునట్లుగా, ఆ దినపత్రికను, ఆంధ్ర వారపత్రికను, భారతిని, వార్షికముగావెలువడు ఉగాది సంపుటములను, పండిత ప్రముఖులు రచించి ఉద్గ్రంథముల ముద్రించుటకొరకైన ఆంధ్ర గ్రంథమాలను, ఆంధ్ర విజ్ఞానసర్వస్వమును తాను నిర్మించిన ఆనకట్టలక్రింద పలుముఖముల ప్రవహించెడి కాల్వలవలె కల్పించిన అనల్ప భాషా సేవకుడు, పండితపోషకుడు, కళలనెలవగువాడు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరాయ సుధీమణి.

పండితాదరణలో అందెవేసిన చెయ్యి వారిది. పుట్టకపూర్వమే తొలిపుట్టువునం పుణ్యకర్మలజేసిన సత్పురుషుడగుట నిజము పుట్టినది మొదలుగా ఆయన పూర్వపుణ్య ఆయనను కాపాడిన దాదియై సర్వ సంపన్నునిగా నొనర్చెను. "పుట్టిన దాదిగా తనదు పుణ్యమె దాదిగ" పెరిగిన పరార్థజీవికి, యీ సంపద నాది కాదనెడి భావము వారి వితరణప్రవాహ జలములోని జీవము. ఈ సంపద లన్నియు లోకహితార్థమే గాని, "కాదు" "నాది" యని నిరూపించెడి "కా॥ నా॥" యను రెండు బీజాక్షరములే కాశీనాథుని నాగేశ్వరరావుగారి పేరును దిగంత విశ్రాంత మొనర్చుటకు చాలును.

"వానిది భాగ్యవైభవము
    వానిది పుణ్యవిశేష మెమ్మెయిన్
వాని దవంధ్యజీవనము
    వానిది జన్మము..."

అని చెప్పదగిన గొప్పజాతకము యీఆంధ్ర నాయక శిఖామణిది.

అట్టి దేశోద్ధారకునకు, విశ్వదాతకు, కళాప్రపూర్ణునకు చేతులు కలిపి ఆంధ్రులు నమస్కరించి తరించెదరుగాక!

"వామన"

# విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి గిరిజ.

# కాలక్షేపం

"అర్క కాంతము చేతనం-బయ్యు సవితృ
పాదములు సోకినంతనె - ప్రజ్వరిల్లు;
గాన నభిమానవంతు డెందైన శత్రు
కృత తిరస్కారమెట్లు సహింప నేర్చు?"

తా॥ సూర్యకాంత శిల అచేతనమయినను సూర్యుని పాదములు (కిరణములు) తనకు తగిలినంత మాత్రముననే మండును. అనగా మండిపడును. కనుక, అభిమానవంతు డెందులోనైనను శత్రువులు చేసిన తిరస్కారమును ఏవిధముగా సహింపగలడు? సహించి యూరకుండడు అని తాత్పర్యము.

సూర్యకాంతశిల అనేది సూర్యరశ్మి తగిలినవెంటనే అమితముగా అతిత్వరగా వేడెక్కుటవల్లను, ఆ నున్నని రాళ్లమీద సూర్యకాంతి దేదీప్యమానముగా జాజ్వల్యమానముగా ప్రతిఫలించుటచేతను, ఆ సూర్యకాంతశిలయొక్క ప్రభావమే అది అని చెప్పవలసి వస్తోంది. స్ఫటికముగుండా గాని, చక్కగా ముఖములు చెక్కబడిన వజ్రము గుండా గాని, కాంతి ప్రసరించినప్పుడు ఆ స్ఫటికముగాని వజ్రముగాని అత్యంత తేజోవిరాజమానంగా ఉంటుంది. కాబట్టి ఆవిధంగా అల్పమైన దీప్తికి అద్భుతమైన ఉద్దీపన చెందడం, ఆ వజ్రములో ఉన్న గొప్ప విశేషం అనక తప్పదు. ఎందుచేతనంటే, సాధారణమైన కాంతివల్ల అసాధారణమైన కాంతితో ప్రకాశించే గుణం సొంతబెట్టిన మేలుజాతి వజ్రానికి ఉంది. కాబట్టి రత్నములలో అగ్రస్థానం అలంకరించేది వజ్రం. ఆయా రత్నమాణిక్యములయందు యీ గొప్పలక్షణం ఏవిధంగా ఏర్పడింది అనే విషయమై ప్రత్యేక పరిశోధనలను డాక్టరు సి. వి. రామన్ గారు యిటీవల విశేషంగా చేశారు. ఆయా రత్నముల నిర్మాణంలోనే కొన్ని పొరలు దిశాంతర్దశలుగా ఏర్పడుటవల్ల వాటికి అటువంటి ఉద్దీపనశక్తియున్నూ, సహజ ఉత్తేజమున్నూ, సంక్రమించినట్లుగా ఒక నూత్న రత్నసిద్ధాంత రత్నమును ఆయన ప్రతిపాదించారు. అటువంటి రత్నరాజపరికల్పనా ప్రయత్నరాజముకూడా రామన్ పండితుడు విసువు విరామం లేకుండా చేయుచున్నాడు. సూర్యకిరణములలో ఉన్నదే మూలకారణమైన కాంతి దానిమూలంగా జిగజిగమని సొగసుగ మెరసెడి సత్తా, వజ్రములో ఉంది. ఈ మణిమయాదుల మహాద్భుత తేజములను చూచి యోచించి శోధించి బోధచేసికొన గల జ్ఞాన తేజస్సు మనలో ఉంది. సూర్యకాంతశిల గాని, వజ్ర వైడూర్యములుగాని ప్రాణం లేని వస్తువులు అనిన్నీ, వాటి మహాద్భుత విశేషములను గ్రహించే మానవుడు ప్రాణం గల చేతనుడనిన్నీ స్థూలంగా విమర్శించి విభజించవచ్చు. కాని, అచేతనమైన పదార్థాలలోకూడా లయ తప్పని నాడి ఒకటి కొట్టుకొనుచున్నదని ఋజావు చేయవచ్చు.

సమకోణములుగల్గిన స్ఫటికం ఒక్కొక్క క్షారమునకు ఒక్కొక్క ఆకారంలోనే ఏర్పడతాయి. మామూలుగా మనము కూరలలో వేసికొనేటటువంటి ఉప్పుయొక్క స్ఫటికములు చతురశ్ర ముఖములు కలిగిన స్ఫటికాలుగా ఉంటాయి. మైలతుత్తము యొక్క స్ఫటికములు త్రికోణ ముఖములు గల్గిన స్ఫటికాలుగా ఉంటాయి. మైలతుత్తమును పొడిచేసి నీళ్ళలో వేస్తే, ఆపొడి పంచదారవలె నీళ్ళలో కరగిపోతుంది. ఎంత ఎక్కువపొడి ఆనీళ్లలో కరుగుతుందో అంత ఎక్కువగా వేసి చిక్కని ద్రావకం వెడల్పయిన గాజుగిన్నెలో తయారు చేయవచ్చు. ఒక గుర్రపు వెంట్రుకకు చివర మైలతుత్తపు స్ఫటికమును (చిన్న స్ఫటికమును) కట్టి ఆ ద్రావణంలో వేలాడకట్టినట్లయితే, ఆ నీళ్లు క్రమేణ ఎండవేడికి తరిగి ఇగిరిపోతూ ఉంటాయి. ద్రావణం చిక్కబడినకొలదీ, సముద్రపు నీటిని ఎండకట్టితే ఉప్పు బయటపడినట్లుగా, మైలతుత్తం బయటపడుతుంది. కాని, యీ విధంగా బయటపడిన మైలతుత్తం గాజుగిన్నెలో వ్రేలాడుచున్న చిన్న స్ఫటికంచుట్టూ చేరుతుంది. ఆ స్ఫటికం క్రమేణ పెరిగి పెద్దదవుతుంది. స్ఫటికం ఎంత పెద్దదయినప్పటికీ త్రికోణాకార ముఖములు గల స్ఫటికంగానే కొలప్రమాణం తప్పకుండా విస్తరిస్తుంది. మొదట చిన్న స్కేలు ప్రమాణంలో ఉన్న స్ఫటికం పెద్ద భారీ సైజులోకి వస్తుంది. కాని, రేఖాగణితం ప్రకారం దానికి ఉండవలసిన కోణములూ ముఖములూ, అనగా దాని కనుముక్కు తీరు, దాని సహజస్ఫటిక లక్షణానికి ఎంతమాత్రమూ విరుద్ధంగా ఉండదు. దీనికి ఒక్క ఉదాహరణ చూడవచ్చు. తల్లి గర్భంలో నుంచి వచ్చిన శిశువు తల్లిపాలను త్రాగిన కొలదీ, మాసాలు గడచినకొలదీ పెరిగి పెద్దదవుతుంది. ముక్కుకు తగినట్లుగా ముక్కు ఎదుగుతుంది. కన్నుకు తగినట్లుగా కన్ను ఎదుగుతుంది. చిన్న సైజులో ఉన్న శిశువు పెద్ద సైజులోకి పెరుగుతుంది. అదేవిధంగా యీ మైలతుత్తపు స్ఫటికం పెరుగుతుంది. పెరిగి పెద్దదైన ఈస్ఫటికానికి తీర్చి దిద్దినట్లుగా కోణాలు ముఖాలు ఏర్పడతాయి. దానిని బాగా ఎండబెట్టిన తర్వాత ఆ స్ఫటికానికి, ఒక కోణం రవ్వంత విరుగగొట్టినట్లయితే, ఆ స్ఫటికం అందవికారం అవుతుంది. ఈ విధంగా అందవికారమైన స్ఫటికాన్ని తిరిగి మైలతుత్తపు నీళ్ళలో వ్రేలాడగట్టి కదలకుండా ఉంచినట్లయితే, ఆ నీళ్ళు ఇగిరి తరిగిపోతూఉంటాయి. ఆ స్ఫటికానికి ఏ కోణం ప్రకృతికి విరుద్ధంగా వికృతంగా ఉన్నదో, ఆ కోణం ముందుగా మరమ్మతు అయిపోతుంది. ఆ కోణంలో విరిగిపోయిన ఆభాగం తిరిగి భర్తీఅవుతుంది. భర్తీ అయ్యేటట్లుగా ఆ నీటిలోని మైలతుత్తపు కణాలు దానికి అతుకుకొని అతి సొగసుగా దానిని మరమ్మతు చేస్తాయి. తాజ్ మహాలులో ఏమూల ఏభాగమైనా విరిగిపోతే తిరిగి మరమ్మతుచేసి, అతాజమహాలును తాజామహాలు చేయడానికి తాతలు దిగి రావాలి. దానిని కట్టించిన షాజహాను దిగి రావాలి. లేదా అక్కడ సమాధియైన ముంతాజుబేగం మళ్ళీ లేచి రావాలి. అనేక వ్యయప్రయాసలకు పాల్పడితే గాని, ఆ పాలరాళ్ళ సమాధిని సరిదిద్దలేము. కాని, స్ఫటికములలోని అణువులు అవలీలగా అందమైన ఆకారములలో తమంతట తామే తమ స్వయంసామర్థ్యంతో రేఖాగణితశ్రేణి తప్పకుండా, రణరంగములో వ్యూహములను ఊహించి సేనలు శ్రేణులు గట్టినట్లుగా, ఉప్పు వగైరా ఆయా క్షారపదార్థములలోని అణువులు కణములు కవాతుచేసి కదంత్రొక్కినట్లుగా లయబద్ధముగా సమయస్ఫూర్తిగా ప్రవర్తిస్తున్నాయి. ఇటువంటి

# ★ కాలక్షేపం ★

సహజప్రజ్ఞ వాటిలో ప్రస్ఫుటమై ప్రజ్వలిస్తున్నప్పుడు, యీ అణువులకు కూడా సహజసిద్ధమైన సుందరాకార శిల్పకల్పనా చాతుర్యం ఉన్నదని మనం అంగీకరించక తప్పదు.

సౌందర్యమంటే ఏమిటో గ్రహించగల శక్తిమానవులమైన మనకు మాత్రమే ఉన్నదని భావించడం భావిలోని కప్ప చొప్పున నుండగలదు. ఈ విషయవిమర్శ యీ విధంగా అగాధంగా చేసినవారికి చేతనమేదో అచేతనమేదో విభజించడం చేతనైనపని కాదు. వృక్షములకు ప్రాణమున్నదనిన్నీ వాటికి కూడా మత్తుమందు యివ్వవచ్చుననిన్నీ వాటికి కూడా నిద్రావస్థయున్నూ, జాగ్రదవస్థయున్నూ ఉన్నదనిన్నీ సర్ జగదీశ చంద్రబోసు గారు కొన్ని యంత్రసాధనములతో ప్రత్యక్షప్రమాణంగా నిదర్శించి నిరూపించారు. అంతేకాదు రాళ్లకు రప్పలకు కూడా నిద్రావస్థ అనేది ఒకటి ఉంటుందని సిద్ధాంతీకరించారు. పూర్వకాలములో మన దేశమందు పర్వతములను గుహామందిరాలుగా అనేకచోట్ల చిత్రవిచిత్రంగా చెక్కి గొప్ప పనితనం చూపించారు. ఒక్కటే కొండ. ఒక్కటే మందిరం. స్తంభాలు, మంటపాలు, ద్వారాలతో కూడిన విహారం. ఏకొండమైన శిల అఖండమైన శిల్పం. ఈ గుహా విహారాలను చెక్కేటటువంటి శిల్పులు ప్రత్యేకంగా ఉండేవారు. ఈ గుహావిహారములను మలిచి తొలచుటకు తగిన శిల్పరహస్యము లనేకం వారికి కరతలామలకంగా ఉండేవి. ఏ రాతిని ఏవిధంగా, ఏ సమయంలో చెక్కినట్లయితే, చెక్కు చెదరకుండా, చక్కని ముఖాలతో శిలలు సులభంగా కళకళ లాడగలవో బోధించెడి శాస్త్రగ్రంథాలుకూడా ఆ కాలంలో వారికి ఉండేవి. శిలలు నిద్రించుచున్న సమయంలో వాటిని చెక్కడం చక్కగా వీలవుతుందని ఆ గ్రంథాలలో వ్రాయబడియున్నదని మన ప్రాచీన శిల్పశాస్త్ర సిద్ధాంతముగా నున్నది. శిలలకు నిద్రావస్థ అనేది ఉన్నదని అంగీకరించిన యుగంలో మన ప్రాచీన విజ్ఞానం మన భారత నాగరికత నిద్రావస్థలో లేదని నిశ్చయంగా నిర్భయంగా నిరూపించవచ్చు.

ప్రపంచములోకెల్ల అద్భుతమైన నిర్మాణములు ఏడు ఉన్నాయని కొనియాడుతూ ఉంటారు. ఆ ఏడు శిల్పకల్పనలలో తాజమహలు ఒకటి. కాని, అసలైన అద్భుత చిత్రం అది కానేకాదు. భారత దేశమే ప్రపంచంలోకెల్ల విచిత్రమైనది. ఈ దేశానికి ఏ పరదేశంనుంచి ఏ పండితుడు వచ్చినా, ఏ ప్రభుత్వ రాయబారి వచ్చినా, యీనాడు మున్ముందుగా ఢిల్లీకివచ్చి రాజఘాటువద్దఉన్న గాంధి మహాత్ముని సమాధిని దర్శించి భక్తి పురస్సరముగా పుష్పములను సమర్పించి నమస్కరించి వెళ్ళుచున్నారు.

మహాత్మునికంటె మహాద్భుతం లేదన్నట్లుగా మహామహావాళ్ళు ఆ సమాధిని సందర్శించి మహాత్ముని స్మరించి వెళ్ళుచున్నారు. ఈ రోజున ఇంగ్లాండునుంచి వచ్చే టటువంటి ఆంగ్లేయ ప్రముఖులు కూడా ఆయన సమాధివద్ద ఒకసారి "అడియేన్" అనకుండా వెళ్లరు. ఏ మహాత్ముణ్ని ఏ ఆంగ్లేయులు ఒకప్పుడు "వెర్రిపుల్లాయి" అన్నారో, ఆ ఇంగ్లీషువారే ఆఖరుకు వెర్రిపుల్లాయిలైనారు. కాని, మహాత్ముడు చదువుకొన్న చదువు ఇంగ్లీషు చదువే. ఇగ్లండుకు వెళ్ళి బారిష్టరు పరీక్ష కూడా చదివి వచ్చాడు. ఇంగ్లీషుభాషలో రచింపబడిన, ప్రచురింపబడిన అనేక ఉద్గ్రంథాలు ఆయన పారాయణం చేశాడు. మహాత్ముడు ఆంగ్లంలో ఆరితేరిన చెయ్యి. రసగుళికలవంటి పసందైన పదముల పొందిక ఆయన, ఆంగ్ల వచనరచనలో ఉంది. ఇంగ్లీషువారికి శిష్యుడై, ఇంగ్లండులో చదివి, ఆంగ్లంలో అఖండ ప్రజ్ఞానిధియై, ఆంగ్లేయులకే ఆయన పంగనామములను పెట్టి, వారు తరించేదారి వారికి తాను చూపించాడు. "భారతదేశం మీ నెత్తిమీది భారమేగాని, అది మీ మెడలో హారం కాదు" అన్నాడు. ఆ తల బరువు మీరు దింపుకుంటే, మీరు తరిస్తారన్నాడు. మహాత్ముడు అందుకనే *Quit India* మంత్రం "క్విట్ ఇండియా" "వీడిపోండి. భారతదేశం" అనే మంత్రం ఉపదేశించాడు. అది వారి స్వదేశరక్షణకే సదుపదేశం అన్నాడు.

గడచిన మహాసంగ్రామంగాని, మొదటి ప్రపంచసంగ్రామంగాని ఎందుకుజరిగింది? బ్రిటిష్‌వారికి బ్రహ్మాండమైన సామ్రాజ్యం ప్రపంచం అంతట విస్తరించి ఉన్నదనే కారణంచేతనే సంభవించింది. ప్రపంచ రాజ్యాల భూగోళపటం త్రిప్పిచూస్తే ఏ సముద్రంలో చూచినా బ్రిటిష్‌వారి దీవులే-ఏ ఖండంలో చూచినా బ్రిటిష్‌వారి వలసరాజ్యాలే, బ్రిటిష్‌వారి అధినివేశరాజ్యాలే. బ్రిటిష్ పరిపాలిత భూభాగములే. ప్రపంచపటంలో ఎక్కడచూచినా ఎర్రరంగులో బ్రిటిష్‌వారి సామ్రాజ్యం సాక్షాత్కరిస్తూ ఉంది. ఇంతటి బ్రహ్మాండమైన సామ్రాజ్య ఏదేశానికీలేదు. ఎక్కడచూచినా ఎర్రరంగు కన్పించడంచేత జర్మనీవంటి దేశానికి కన్నెర్రగా ఉండేది. ప్రపంచంలో ఏదో ఒక భాగంలో సూర్యుడు సదా ప్రకాశిస్తూ ఉంటాడనిన్నీ, ప్రపంచంలో బ్రిటిష్ సామ్రాజ్యంలో ఏదో ఒక ప్రాంతంలో 24 గం|| సూర్యరశ్మి తగులుతూ ఉంటుంది గనుక, వారిది "రవి అస్తమించని రాజ్యం" అన్నారు. అటువంటి ఆంగ్ల సామ్రాజ్యం అంతటికీ భారతదేశం అగ్రస్థానం వహించింది. బ్రిటిష్. మకుటంలోని

మహోజ్వలమాణిక్యం భారతదేశంఅన్నారు. *Brightest Jewel in the Diadem of England* అని బ్రిటిష్‌వారే చెప్పుకొన్నారు. "ఎందుకు మీ ఒంటినిండా యీ మాణిక్యాలు? ఈ రాజ్యరత్నాలు? ఈ ఆభరణాలన్నీ మీరు తగిలించుకొని బయట బడాయిగా తిరిగినంతకాలం, ఇతరుల చూపు అంతా మీ మీదనే ఉంటుంది. ఎవడుకన్ను వేసినా, యీ అన్నులమిన్న మీదనే కన్ను వేస్తాడు. ఎవడే ఆయుధధారియైనా యీ అన్నులమిన్న ఆభరణాలు అపహరించడానికే ఆయత్తమవుతాడు. కనుక మీ ఆభరణాలన్నింటిలో నాయకమణియైన భారతదేశాన్ని ముందుగా విసర్జించండి" అన్నాడు మహాత్ముడు. అదే క్విట్ ఇండియా మహామంత్రం.

హిట్లరు కూడా గత మహాసంగ్రామం సాగించక పూర్వం ఒక హెచ్చరిక చేశాడు. సర్వ సముద్రాధిపత్యం యించుమించుగా బ్రిటిష్‌వారి చేతులలోనే చిక్కియున్నది. జిబ్రాల్టరు జలసంధి, సూయజు కాల్వ, సింగపూరువద్ద మలాకా జలసంధి యీ మూడున్నూ, ప్రపంచాన్ని నావలు చుట్టివచ్చుటకు దాటిపోవలసిన ప్రధాన సముద్ర సింహద్వారములవంటివి. ఈ మూడున్నూ బ్రిటిష్‌వారి చేతులలో చిక్కియున్నవి. ఈ విధంగా సముద్ర రహదారీల టోలుగేట్లు గుండా వారిచీట్లు పర్మిట్లు లేకుండా ఏ దేశపు నావలైనా యీవలకు ఆవలకు పోవుటకు వీలులేదు. త్రోవలో దీవులు రేవులు చాలా వీరివే. ఇదే బ్రిటిష్‌వారికి హస్తగతమైన సర్వసముద్రాధిపత్యం. ఈ సముద్రాధిపత్యం వారికి ఉండుటవల్లనే వారి సామ్రాజ్యం ప్రపంచం అంతటా విస్తరించి, వీరి నావలు విహరించి, "మా బలము నెదిరించగలవారు మేదినిగలరే?"యని బ్రిటిష్‌వారు గర్వించుటకును, బ్రిటిష్‌సింహముగర్జించుటకును, సన్నజీవాలవలె చిన్న రాజ్యాలు గజగజ లాడుటకును కారణభూతమైంది. ఈ సర్వసముద్రాధిపత్యము ఒక్క బ్రిటిష్‌వారి కుండడం చూచి ఊరకుండడం మేలుకాదని హిట్లరు న్నాడు. సముద్రాధిపత్యంలో వాటా జర్మనీకికూడా (జర్మనీమిత్రులైన ఇటలీకి జపానుకుకూడా) విభాగించవలెనన్నాడు. ఈ విధంగా బ్రిటిష్‌వారి సామ్రాజ్యాధిపత్యంమీదనూ, యీ సామ్రాజ్యాగ్నికి ఆజ్యంవంటిదైన సాగరాధిపత్యం మీదనూ హిట్లరు కన్ను వేశాడు. ఈ అధిపత్యం వారు వదలుకుంటే, వారితో పోరు తనకు లేదన్నాడు.

ఇంతకూ మూలకారణం ఎక్కడ ఉన్నదంటే రవిక్రుంకని రాజ్యంలో ఉంది. ఆ రవిక్రుంకని రాజ్యంతోనే వారిది ప్రభ క్రుంగిన రాజ్యం అయింది. ఎంతటి రాజాధిరాజు అయినా

Rule! Brittannia! Rule!
Brittannia Rules the Waves!

"పాలించు! పాలించు! మో
ఆంగ్లదేశమా!
కడలిపై కెరటాల శాసించు
నింగ్లాండు!"

అని అంతగర్వంగా జయభేరి మ్రోగించుకొనడం, కంచు మ్రోగినట్లు మ్రోగడమే అవుతుంది. ఆ జయభేరీ మ్రోత కేవలము తాతలనాటి కాలంలో రాజులు పరరాజులపై సవాలు చేసి, రాజసూయయాగం వంటి సవాలు చేసినట్లుగా ఉంటుంది. "రాజాధి రాజా! మార్తాండ తేజా!" అని పిలిపించుకోవలెననే తలపు భూతలమున వెలసిన తెలుపుజాతులకైనా, నలుపుజాతులకైనా కలహకారణమవుతుంది. "మార్తాండ తేజా!" అంటే సూర్యుని అంతటి తేజస్సు గలవాడా! అనే అర్థం స్ఫురించుచున్నప్పటికీ, రాజుయొక్క ప్రభుత్వం చల్లగా ఉండవలెనని ప్రజలు కోరుతూఉంటారు. ఏ రాజుయొక్క ఏలుబడిలో యుద్ధాలు లేకుండా ప్రజలు ప్రశాంతంగా పాడిపంటలతో సుఖంగా జీవిస్తారో అటువంటి రాజుయొక్క ప్రభుత్వము చల్లని ప్రభుత్వం అంటాము. "రాజు" అనే మాటకు "చంద్రుడు" అనే అర్థంకూడ అమలులో ఉంది. శ్రీరాములవారు పుట్టినది సూర్యవంశంలో, ఆయన ఆ సూర్యవంశానికి ఆభరణంవంటివాడు. "ఇనకుల తిలకము" "రవికుల సోముడు" అనిపించుకున్నాడు. "సూర్యవంశములోని చంద్రుడు" అనే కీర్తి సంపాదించాడు. "రఘువంశ సుధాంబుధి చంద్రశ్రీ" అనే మనోహరమైన కదన కుతూహల రాగంలో ఆలాపన చేసినప్పుడుకూడా రఘువంశమనెడి పాల సముద్రములో ఉద్భవించిన చంద్రుడని కీర్తించారు. రాములవారిని "శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః" అని ఉపాసన చేయని ఉపాదాన బ్రాహ్మణుడులేని ఊరు ఆంధ్రోర్వి లేదనుట నిర్వివాద విషయము. ఆంగ్ల మహాయుగంలో కూడా విక్టోరియా రాణి ఏలుబడి చల్లని ప్రభుత్వం అని ప్రజలు ప్రశంసించి పద్యాలు వ్రాశారు. కారణం ఏమిటంటే ఆమె అధికారంలోనికి రాగానే భారతదేశప్రజలందరికీ ఒక అభయహస్తం వ్రాసి యిచ్చింది. "మేము మీమీ మతవ్యవహారవిషయములలో ఎటువంటి జోక్యమూ కలుగజేసికొనము" అని హిందువులకూ మహమ్మదీయులకుగూడా ఆ రాణి ఆకాశవాణివలె పలికింది. జై! విక్టోరియా రాణికీ జై! అని ఆమెకు జూబిలీ ఉత్సవాలు దేశమంతటా చేశారు.

స్త్రీలలో కెల్ల ఆణిముత్యంవంటిది యీ రాణి అన్నారు.

"అన్నుల సుపాణి విక్టోరి-యాఖ్యరాణి" అని పద్య పరంపరలు చోద్యంగా చదివినారు.

ప్రభువుయొక్క ప్రతాపము తన్ను ప్రతిఘటించినవానిమీద చూపిస్తే, కత్తి ఝుళిపిస్తే, "రాజా నెడలె రవి తేజములలరగ!" అనే సంకీర్తనము రణరంగోత్సాహియైనప్పుడు చేయవలసినదేగాని ప్రజోద్ధరణరంగోత్సాహియైనప్పుడు చేయవలసిన స్తోత్రముమాత్రము కాదు. ప్రభువు ప్రసన్నవదనుడైయుండుటవల్లనే ఆయన చూపులు వెన్నెల కాంతులవలె మన్ననపొంది అతడందరిలో మిన్నయని ఎన్నబడును. సకల జీవరాసులకు చేవనిచ్చెడివాడు సూర్యుడు. సూర్యుడు ప్రకాశించకపోతే, యీ భూమిపై బ్రతికే జంతువు కంచుకాగడా వేసి వెతికినా కన్పించదు. కనుక, అటువంటి సందర్భంలో చేతనాప్రపంచానికి అంతటికి చైతన్యం యిచ్చేటటువంటి ఆ సూర్యుడు అనబడే గోళము ప్రాణంగల వస్తువా ప్రాణంలేని వస్తువా? అది బ్రహ్మాండమైన అగ్నిగుండము. దానిలో, ఈ అణుశక్తి రేడియోతేజ విరాజమానమైన మహాగ్నిగుండ మండలంలో, జీవరాశి అనేదిఉంటే, ఎండమావులలో కూడా మంచినీళ్ళు చెంబుతో ముంచుకొని త్రాగవచ్చు. కనుక, సకల జీవాధారమైన సూర్యగ్రహంలో జీవరాశి లేనేలేదు. అసలు యీ మహాగ్నిగోళం చేతనమా? అచేతనమా? అని శంకించి శాస్త్ర చర్చ చేయవచ్చు. కట్టె ఎంత ప్రాణంగలదో మండుచున్న కట్టెకూడా అంత ప్రాణంగలదే యనుటలోగల దోషం లేదు. సూర్యదే మనకు కాలప్రమాణ కాల పురుషుడుగా, కాలసూచిగా, కాలుడుగా ఉన్నాడు. ఎండలో కాలు కాల్చుచున్న

(48-వ పేజీ చూడండి)



కల పూర్తిగా చూసి కళ్లు తెరిచాడు గోపాలం.

అలసిపోయిన అప్సరసవలె రాధ పక్క బెర్తుమీద నిద్రపోతోంది.

*　　*　　*

దాదాపు ఇరవైఏళ్ళక్రితం ఒకరోజు పొద్దున్నే బ్రహ్మదేవుడు ఒక ముక్కు తయారుచేశాడు. చాలా చక్కగా వచ్చిందాముక్కు. సన్నగా, పొడుగ్గా, నాజూకుగా తయారయింది. చివర సూదిగా కొన దేలింది. ఆ కొన పైకి చూడ్డం మొదలెట్టింది.

ఎంతబావుందీముక్కు! అనుకున్నాడు బ్రహ్మదేవుడు.

చాలా బావుందని మీ తాత్పర్యం - అంటూ మొహంముడుచుకుని టీక చెప్పింది- పక్కనేకూర్చుని వీణ వాయించుకుంటున్న సరస్వతీ దేవి.

ఆ ముక్కుకోసం ఒక చక్కని అమ్మాయిని సృష్టించదలచాడు బ్రహ్మదేవుడు.

*　　*　　*

రాధకి, దేవుడు బంగారు కవచం ప్రసాదించాడు.

దీపకళికవంటి సింధూరతిలకం ఉంచడానికి అనువుగా ఆమె కోలముఖంలో బహుళ పక్షపు నవమిచంద్రుడివంటి నుదురు తీర్చి దిద్దాడు.

జీవితంలో దుఃఖం అనేది ఉందా? అలాగా! నాకు తెలీదే. ఎక్కడుంది? - అన్న ధోరణిలో సూటిగా ప్రశ్నించే నిమిత్తం, సన్నగా ముడుచుకుని కౌటుకరేఖవలె కనిపించే చక్కని కళ్ళు రెండు అమర్చాడు.

చిన్న వొంపుతో సన్నంగా ఉండే అరుణారుణ రదనాలు హసించినపుడు అటూ ఇటూ నున్నని మెత్తని చెంపలమీద రెండు చిన్న సొట్టలు లీలగా గోచరించే ఏర్పాటు చేశాడు.

ఇంతవరకూ బావుంది.

ఒకానొక చిన్నదాని చక్కదనం యావత్తూ ఒకే ఒకముక్కులో చెప్పగలిగేంత అందంగానూ - సన్నగా పొడుగ్గా నాజూగ్గా ఉండి, నీలెక్క నాకేమిటిలే అన్నంత నిర్లక్ష్యంగా, ధీమాగా, లోకాన్ని

## ముళ్ళపూడి
## వెంకట[illegible]ణ

చూడగలిగేటంత పొగరుగానూ - తను చెక్కిన ముక్కున్ని, ఈ రాధమ్మ వదనాన అమర్చాడు.

ఇదికూడా గొప్ప విషయమే.

పోతే, ఆమె ముఖద్యుతులు మరీ ప్రస్ఫుటంగా - అమాట కొస్తే ద్విగుణీకృతంగా తెలియడంకోసం అమవసనిసికన్న, దీపపు మసికన్న నల్లగా ఉండే వేణీభరాన్ని ప్రసాదించాడు.

*　　*　　*

దేవుడి కెలాగేనా మంచి ఈస్థటిక్ సెన్సువుంది అనుకున్నాడు గోపాలం, - నిద్రాముద్రితయైన రాధమ్మని శ్రద్ధగా చూస్తూ.

ఆమె కంఠాన్ని ఆలింగనం చేసుకున్న నల్లని ఖత్తికంటివల్ల ఆమె మెడ సౌకుమార్యం ఇను మడించింది.

ఆమె ధరించిన నల్లని ఆర్గండీ రవిక ఆమె భర్మప్రభని మఋగుపఅచబోయి మెఋగు పెడుతూన్నదని గోపాలం గమనించాడు. ఆనందించాడు.

హఠాత్తుగా అతని మనస్సు చివుక్కుమంది. ఈ రాధమ్మకి ఇంత సౌందర్యం ఇచ్చినదేవుడు, అవివేకం అంటకట్టా నిపించింది. శ్రుతి పేయమైన మధుర మంజుల వీణారవం మధ్య, గాడిద ఓండ్ర పెట్టినట్టనిపించింది.

హృద్యంగా అమరిన ఈ మహత్తర సౌందర్య వర్ణార్ణవాన, ఆమె కట్టుకున్న ఎర్రరంగుచీర మహా వికృతంగానూ, అసహజంగానూ కనిపించింది. వెక్కిరించినట్టనిపించింది.

ఛీ! నల్ల రవికకు ఎర్రచీర ఏడిసినట్టుంది. భయంకరంగా వుంది - అనుకున్నాడు గోపాలం.

అతనికి రాధమ్మమీద కోపం వచ్చింది.

ఇంత వికృతాన్ని ఇందాకటినించీ తను గమనించనందుకు ఆత్మ గర్హణ కావించుకుని పశ్చాత్తప్తుడయ్యాడు.

ఉత్తరక్షణాన రాధను లేపాడు.

బద్ధకంగా ఒళ్ళు విరుచుకొని కొద్దిగా కళ్ళు తెరిచింది రాధ. 'ఏం?' అంది - మత్తుగా మెత్తగా నవ్వుతూ.

'లేచికూచో' - అన్నాడు గోపాలం గంభీరంగా ప్రశ్నార్థకంగా చూసి లేచికూచుంది రాధ.

'ఈ నల్లరవికమీద ఎర్రచీర బావులేదు

వెంటనే నువ్వు తెల్లచీర కట్టుకోరాధా -' అన్నాడు.

రాధకి అర్థం కాలేదు.

"నిజంగా రాధా. పైగా ఆ ఎఱ్ఱచీర బాధ కలిగిస్తోంది. నీ బంగారు ఛాయకి నల్లరవిక మీద తెల్లచీర బాగుంటుంది. చాలా బాగుంటావు. దేవతలా ఉంటావు" అన్నాడు గోపాలం.

భర్తలో ప్రకోపిస్తున్న కవిత్వధోరణి గమనించి మందహాసం చేసింది రాధ. తిలా, ... తాటిస్తూ 'బాగుంది. పని మత్లే నిద్రలేపి ఇదా చెప్పొచ్చారు! మంచి నిద్ర పాడుచేశారు' - అన్నది.

గోపాలం ప్రాధేయపడ్డాడు. 'బంగారు తల్లివి అంటాను కాని, నామాట విను. ఇది బాగులేదు. తెల్లచీర కట్టుకో!

కళ్లు చిట్లించింది రాధ. 'బాగుందండీ' పేచీ. ఇప్పుడు ఈ అర్థరాత్రి నా అందానికి తక్కువొచ్చిందేవిటి! రైలు దిగాక రేపు కట్టుకుంటాను లెండి' అంది.

'కాదు' ఇప్పుడే కట్టుకోవాలి' అన్నాడు గోపాలం చిరాకుగా.

రాధ తత్క్షణం పరాకు అభినయించి, కిటికీలోంచి, బయట పరుగెడుతున్న ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించడానికి ఉపక్రమించింది.

'కాదు. ఇప్పుడే తెల్లచీర కట్టుకోవాలి.' అన్నాడు గోపాలం మళ్ళా.

రాధమ్మకి పట్టుదల ఎక్కువైంది. కొంచెం ఆశ్చర్యంకూడా కలిగింది ఈ అబ్బాయి పద్ధతిచూసి.

ఇతగాడు తనని పెళ్ళిచేసుకు మూడు మాసాలు అయింది. ఇప్పుడు తొలిసారిగా తనని పట్నం తీసుకెళ్తున్నాడు. దార్లోనే ఇంత డబాయింపు చెలాయించడం రాధకి ఏ మంత నచ్చలేదు. ఎంత మొగుడయితే మాత్రం మరీ ఇంత ఇదయితే ఎలా? తనేం చీరకట్టుకోవాలో తనకి తెలీదు!

ఇవాళ చీరగురించి డబాయిస్తున్నాడు. రేపు, - ఏయ్! అమ్మాయ్! నీ ముక్కు మరీ అంత పొగరుగా, అంత సూదిగా ఉండి అలా పైకి చూడటం నాకేం నచ్చలేదు. ఆ ముక్కుని కొస్తవంచి, సంపెంగ పువ్వులా చేసుకో - అనొచ్చు.

ఇప్పటినుంచీ జాగ్రత్తపడి అదుపులో ఉంచాలనుకుంది రాధమ్మ. అందుకని, గోపాలం వేపు ఒక్క క్షణం జాలిగా చూసి నిర్లక్ష్యంగా నవ్వి, పడుకుని కళ్లు మూసుకుంది.

గోపాలానికి ఒళ్లు మండిపోయింది. హా! నా అర్ధాంగి, కళత్రం, భావిజీత భాగస్వామి అయిన ఈ పిల్లకి నాపట్ల ఇంత నిర్లక్ష్యమా! అనుకున్నాడు. కుడికాలుతో



ఆయొక్క సెకండు క్లాసు రైలుపెట్టి కళ్ళు వేలమీద గట్టిగా కొట్టాడు. నాసాపుటాలు ఎగరేశాడు. కళ్ళు పెద్దవి చేశాడు. చెవులు రిక్కించాడు పెదిమలు బిగించి, గట్టిగా నిశ్వసించాడు. పైగా 'హుఁ' అన్నాడు.

రాధ మళ్ళీ ఒక్కసారి కళ్ళు తెరిచి, ప్రేమా, లాలింపు, ప్రణయకోపం, ప్రాధేయపూర్వకమైన వినతి, మొదలుగాగల, అమలులో ఉన్న వివిధరసాల సరంజామా యావత్తూ సరియైన పాళ్లలో మేళవించి ఒకేచూపు చూసి, తిరిగి కళ్లుమూసుకుంది. "పడుకోండి బాబూ పొద్దున్న మాట్లాడుకుంటూ లెండి". అంటూ.

చామన ఛాయకు ఇంకో ఛాయ తక్కువ ఉండే గోపాలం తెలూకు ముఖం దాదాపు ఎఱ్ఱబడింది. అతనికి ఉక్రోషం వేసింది. ఆఖరిమాటు హెచ్చరించాడు.

"ముత్యం మూడోసారి అడుగుతున్నా నువ్వు వెంటనే లేచి ఎఱ్ఱచీర మార్చి తెల్ల చీర కట్టుకుంటావా లేదా?"—అన్నాడు.

రాధమ్మ పట్టుదల పదిబారలు పాగింది. నిరసనసూచకంగా, వెంటనే ఒత్తిగిలి మూసెంకవేసి దుప్పటి కప్పుకుంది.

రైలు ఏదో చిన్న స్టేషనులో ఆగింది.

ఓడిపోయిన గోపాలం తుదిసారి ప్రయత్నించాడు—"రాధా! ఆఖరుసారి అడుగుతున్నా. చెప్పు. లేకపోతే నేను రైలు దిగిపోతాను"—విడుపుగొంతుని కోపంగా వినిపిస్తూ.

రాధ గాఢనిద్ర అభినయించింది.

"అయితే దిగిపోనా?" అన్నాడు గోపాలం.

రాధ పెదిమలు బిగించి చిరునవ్వు అదిమిపట్టింది.

సిగరెట్లు పెట్టే, లైటరూ చేతిలో తీసుకున్నాడు గోపాలం. "తెల్లచీర కట్టుకోమని ఆఖరుసారి ప్రార్థన. లేకపోతే రైలు దిగిపోతానని బెదరింపు. ఈ చెప్పే మాటలు నిజం అని హామీ -" అన్నాడు జనాంతికంగా.

రైలు కదిలింది. రాధ మెదలలేదు.

# ★ లహరి ★

గోపాలానికి వీరభద్రుడు పూనాడు. నాసాపుటాలు అదిరాయి. పెదిమలు వణికాయి. "హూఁ" అన్నాడు.

ఒక్క క్షణం తేరిచూసి, తలుపుతీసి, తటాలున ప్లాటుఫారంమీదికి దూకేశాడు. నాలుగు పెట్టెలుపోనిచ్చి ఒక మూడవతరగతి పెట్టెలోకి ఎక్కి మహాకోపంతో కూలబడ్డాడు. కొంచెంసేపటివరకూ థింకర్సు లైబ్రరీవారి ట్రేడు మార్కు ఆసామీ పోజులో నుదుట పిడికిలి ఆనించి కూర్చున్నాడు. దరిమిలాను చెయ్యి నొప్పిపెట్టి, సక్రమంగా కూర్చుని, కిటికీలోంచి బయటికిచూసి, తెల్లటి చల్లగాలి వీచేసరికి ఆవేశించిన వీరభద్రుడు దిగిపోయాడు.

*  *  *

నల్ల రవికమీద ఎఱ్ఱచీర బాగుండదని మొగుడు అభిప్రాయపడినప్పుడు, అతగాడి మాటను గౌరవించి పాటించాలన్న సద్బుద్ధిని ఆ చిన్నదానికిగాని, - లేదా, దాని చీర గొడవ నాకెందుకులే, అయినా రేపు చూడచ్చులే, అనేవివేకం, ఓర్పూ ఆ చిన్నవాడికిగాని నువ్వు ఎందుకు ఇవ్వలేదని నేను నిన్ను అడుగుతున్నాను సరస్వతీ! నువ్వు చేసిన పని తప్పు అని బ్రహ్మదేవుడు సరస్వతిని చీవాట్లు పెట్టాడు.

తప్పు నాదో మీదో, ఆ రైల్లో ఏడుస్తున్న ఆ చిన్నవాడివంక చూడండి తెలుస్తుంది - అంది సరస్వతి వీణ పాట ఆపకుండానే.

బ్రహ్మదేవుడు కిందకిచూశాడు.

*  *  *

'నా ఈ చేతా - విధాత రాతా' అనే పాట పాడుతున్నాడు - పరుగెడుతున్న పూరీప్యాసెంజరు బండి మూడవతరగతి పెట్టెలో కూర్చున్న గోపాలం.

నేనెంత తొందరపడ్డాను! అనవసరంగా, నా ప్రాణప్రియని సెకండు క్లాసు పెట్టెలో ఒంటరిగా వదలిపెట్టి ఇలా వచ్చేశానే! హా! ఇదంతా బ్రహ్మరాత! అనే భావాన్ని వ్యక్తపరుస్తున్నది గోపాలం పాడుకున్న పాట. అతని హృదయం పశ్చాత్తాపం చెందింది. వదనం పరిదీనమయింది. పాట పూర్తి అయేసరికి అతని బాధ ద్విగుణీకృతమైంది. పైగా భయం ఆవరించింది. తను నిజంగానే రైలు దిగిపోయాడని తెలుసుకోగానే రాధ హడలెత్తిపోతుంది. పాపం - అనుకున్నాడు.

గుండె గతుక్కుమంటుంది కాబోలు.

రాధమ్మ భయపడ్డప్పుడు ఆమె ముఖం [illegible]

లేదు... కొత్త అందం వస్తుందేమో... ఇక్కడ గోపాలానికి సందేహం వచ్చింది. చదువుకున్న పిల్ల, రాధ అసలు భయపడుతుందా - అని. భయపడ కేంచేస్తుంది?

అసహ్యించుకుంటుందేమో!

ఛా. తనంటే రాధకి ఎంతో ఇష్టం. గౌరవం. ఆదరణ. భక్తి. అపేక్ష. తన అందాన్ని, తెలివితేటలనీ ఆరాధిస్తుంది.

నవ్వుకున్నాడు - బాధపడుతూ.

తను అందంగా ఉండడనీ, నల్లగా ఉంటాడనీ చిన్నప్పుడు స్నేహితులు వెక్కిరించేవారు. అమ్మ వేళాకోళం చేసేది. చుట్టాలందరూ, నల్లమనుషుల ప్రసక్తి వచ్చినపుడల్లా తన పేరు ఎత్తేవారు. వాళ్ళందరికీ ఇంత లోకువ అయిన తనమీద రాధకి ఎందుకు అంత ఇష్టం? పెళ్లాం కాబట్టా? ఆమాటకొస్తే, ఇష్టంలేందే అసలు పెళ్ళెలా ఆడింది?

అప్రయత్నంగా అతని చెయ్యి జేబులోంచి ఒక నలిగిన ఉత్తరం తీసింది. నిజంగా రాధకి తనమీద గౌరవం, ప్రేమా, ఉన్నాయనడానికి ఇదే నిదర్శనం.

రాధ తన స్నేహితురాలికి రాసుకున్న ఈ ఉత్తరం మూడురోజులక్రితం ఆమె పెట్టెలో దొరికింది. చదివి ఆశ్చర్యంతో గుండెలు బాదుకుని, ఆ ఉత్తరం తీసి దాచేసుకున్నాడు...

ఉత్తరం మడతవిప్పి మళ్ళీ చదువుకోటం ప్రారంభించాడు....

మాలతీ! మావారు చాలా మంచివారు. నిన్నుగురించి బోలెడు చెప్పాను నిన్న. నీకు ఎఱ్ఱమొగుడిమీద అపేక్ష ఉందని చెప్తే పకపక నవ్వారు. వాడిని కొరుక్కుతింటుందా ఏం? అన్నారు. అలా అని ఆయనకి ఎర్రవాళ్ళమీద అసూయ అనుకునేవు. ఆయన నల్లగా ఉంటారు కాబట్టే నా కిష్టం ఆయనకీ అందుకే ఇష్టం. నల్లగా సన్నగా ఉంటారు. ఆయన దగ్గర నించుంటే, 5 అడుగుల 2 అంగుళాల పొడుగున్న నేను ఆయన చెవులదాకా వస్తాను. నుదురు వైశాల్యాన్ని ప్రస్ఫుట పరిచేట్లుగా కనుబొమ్మలు ఈ చివరనుంచి ఆ చివరిదాకా ఉంటాయి. కళ్ళు సన్నంగా నల్లటి గీత గీసినట్టుంటాయి. బలంగా ఆరోగ్యంగా ఉండే ముక్కు, విశ్రాంతిగా వున్న విల్లువలె వంపు తిరిగిన పైపెదిమా, పట్టుదలా, పౌరుషం, తెగింపూ ప్రకటిస్తాయి. మాలతీ, నా మొగుణ్ణి నేను నీదగ్గర పొగడటం వల్ల నాకు ఒరిగేదేంలేదు. అన్నట్టు మర్చి[illegible] నించున్న పుడు చిత్రంగా అజంతా బొమ్మలా నించుంటారు. ఒసేయ్ మాలతీ. మా ఆయన అందరిలాగా ఉండరు. మొగాడిలా ఉంటారు. ఇంకా......"

ఆరోమాటు ఆ ఉత్తరం చదువుకున్న గోపాలానికి, ఆనందం పెల్లుబికి స్వచ్ఛమైన నవ్వొచ్చింది.

రాధకి తనంటే ఇష్టం. తను రాధని ఇపుడు ఒంటరిగా రైలు పెట్టెలో వదిలేసి వచ్చాడు. రాధ భయపడొచ్చు. తనని ఏవగించుకోవచ్చు.

'బటాణీలండి బటాణీలు. కాలక్షేపం బటాణీలు' అంటూ ఓ పెద్ద గిరజాల మనిషి పెట్టెలోకొచ్చాడు. ఎవరూ కొనలేదు. వాడు తిరిగి బయటకెళ్ళి రైలు మెట్లంబటా, మెట్లులేనప్పుడు, పెట్టెలకింద కడ్డీలమీదా నడుస్తూ ముందు పెట్టెలకు వెళ్ళిపోతున్నాడు - బటాణీలబుట్టా గిరజాలతో సహా. హఠాత్తుగా గోపాలానికి భయంకరమైన ఆలోచనొచ్చింది. ఈ బటాణీలవాడు, ఇలా ప్రతి పెట్టీ చూసుకుంటూ రాధఉన్న పెట్లోకెడితే!

అమ్మో! అనుకున్నాడు.

ఇంకేమన్నా ఉందా! ఒంటరిగా ఉన్న రాధ వీణ్ణి చూసి హడిలి పోతుంది.

హడిలిపోయి, ఒంటరిగా నగలతో ఉన్న అందమైనరాధని చూసి ఈ బటాణీలతొలూకు గిరజాలవెధవ త్రికరణశుద్ధిగా పాడుపనికి పూనుకోవచ్చు.

గుండె ఆగిపోయింది గోపాలానికి.

ఇదివరలో ఇలాటి సంఘటనలగురించి పేపర్లలో ఎన్నో చదివాడు. 'మొదటి తరగతి పెట్టిలో ఒంటరిగా ఉన్న స్త్రీ నగల అపహరణ' — 'కత్తితో బెదిరించి నగలు లాక్కున్న వైనం' మొదలైన హెడ్డింగులతో ఎన్నో వార్తలు చదివాడు. అపుడయితే నవ్వుకున్నాడు. కానీ ఇపుడు తన రాధకి...

లేచి నుంచున్నాడు గొలుసు లాగుదామని. కానీ ఇంతకీ ఈ బటాణీల భగవాన్లు ఆ పెట్లో కెళ్ళకపోతే... చేతి చమురు యాభైరూపాయలు పైగా రాధ ముందు తను వెంగళాయవడం సంభవిస్తాయి.

సరేలే - అంతగావస్తే అదే లాగుతుంది గొలుసనుకున్నాడు.

కాని, మనస్సులో ఆరాటం తగ్గలేదు. కిటికీలోంచి నిశ్చలంగా బయటకి చూడసాగాడు. బైట వెన్నెల విపరీతంగా కాస్తోంది. అంతా వృథాఅయిపోతోంది. చల్లనిగాలి పుష్కలంగా వీస్తోంది, అంతా వృథా! రైలింజను నీటితుంపర్లు చల్లగా, బుగ్గలమీద తాకాయి. అంతా వృథా. తనిక్కడ; రాధ అక్కడ.

ఒక చక్రని ద్విచక్రం యాద్బచ్ఛికంగా

కొద్ది క్షణాలసేపు కనబడింది. రైలు కట్టదగ్గరగా ఒక నాయుడుబావా, అతని తాలూకు నారాయణమ్మా నుంచుని సవిలాసంగా రైలుని చూస్తున్నారు. వెన్నెలంతా వాళ్ళమీదే పడుతోంది. వాళ్ళవెనకాల ఆకుపచ్చని వరిచేలు మెత్తగా నిశ్శబ్దంగా ఊగుతున్నాయి. గాలి వాళ్ళని దూసుకుపోతోంది. నారాయణమ్మ నాయుడుబావని ఆనుకుని అతని మెడచుట్టూ చేతులు వేసి, తల భుజంమీద ఆన్చి మహావిలాసంగా కులుకుతూ నిర్లక్ష్యంగా రైలువంక చూస్తోంది. నాయుడుబావ నారాయణమ్మ నడుంచుట్టూ చెయ్యేసి పొదివిపట్టుకుని గంభీరంగా నుంచున్నాడు.

పొలాల్లో చుట్టుపక్క లెవరూ లేరు. రైల్లో పోయేవాళ్ళు దిగి వాళ్లనేం చెయ్యలేరు. అంచేత వాళ్లిద్దరూ అంత అందంగా ఆనందంగా నించున్నారు.

ఈ పొలాల్లో రాత్రిపూట పురుగూ పుట్రా, దొంగా దోరా వస్తే నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు. నిన్ను కాపాడేది నేను అని అభయం ఇస్తున్నట్టుగా నించున్నాడు నాయుడుబావ.

గోపాలం సిగ్గుపడిపోయాడు; తను రాధని దొంగలపాలు చేసి ఇలా తొందరపడి వచ్చేసినందుకు.

నాయుడుబావ ఠీవి, నారాయణమ్మ సోయలూ అతనిలో పులకలెత్తించాయి. సరిగ్గా మూడురోజుల క్రితం, తనూ, రాధా, ఇలాటి సమయంలోనే ఒకళ్ళనొకళ్ళు ఆనుకుని మైమరచి కూర్చున్నారు—వాళ్ల ఇంటి తోటలోనే....

* * *

...దిగుడుబావికి ఇవతలగా వేపచెట్టు కింద తడిసిన పచ్చగడ్డిమీద కూర్చున్నారు. కొత్త మూలాన రాధ బోలెడు సిగ్గుపడిపోయింది. తలవంచుకుని, ఎడంకాలి వేళ్లతో గడ్డిపరకలని తుంపుతోంది. ఆవేళ శుక్రవారం. తలంటి పోసుకుంది. ముఖాన పసుపు ఛాయలు ఇంకా పోలేదు.

ఆగి ఆగి వీస్తున్న గాలికి నుదుటిమీదా, చెంపలమీదా కంగారుగా ఊగుతున్న మెత్తని పట్టుకుచ్చువంటి శిరోజాల వెనుక రాధ పచ్చని ముఖాన దిద్దుకున్న కుంకుమబొట్టు మబ్బుల వెనకనించి ఉదయించే పూర్ణచంద్రుడివలె గోపాలానికి గోచరించింది.

ఎగిరెగిరి పడుతున్న సముద్ర ఉపరితలాన ముహుర్ముహుశ్చలితమయే పచ్చని మెత్తని చంద్రకాంతి జ్ఞాపకం వచ్చింది. తొలిసారిగా గోపాలంలో కవిత్వం తలెత్తిన సందర్భం అదే.

గడ్డిపరకలని తెంపడం ఆపి రాధ హఠాత్తుగా తలెత్తి, 'పట్నం ఇంతకన్నా ఏం బాగుంటుందండీ!' అంది – ముక్కుచిట్లించుకుంటూ.

'నీకు తెలీదులే' అన్నాడు తను నవ్వుతూ.

రాధ తిరిగి తలవంచుకుని తడిసిన గడ్డిపరకలని త్రుంచడంలో నిమగ్నురాలై పోయింది.

వెన్నెల బాగా వచ్చింది. గడ్డిపరకల చివర నిలచిన నీటిబొట్లు మంచి ముత్యాలవలె మెరిశాయి. ఆ కాంతిలో రాధ ముఖం కలకలా వెలిగిందని తను రెండోసారి అనుకున్నాడు... ఈపిల్ల శాపంవల్ల ఈ భూలోకానికివచ్చిన దేవత కాదుకదా! తనకి దూరమైపోతేనో! అమ్మో!...భయం వేసింది. రాధచుట్టూ చెయ్యివేసి దగ్గరకు తీసుకున్నాడు. తల భుజాన ఆనించి ఆకాశంవంక చూస్తూన్న రాధ చిన్నపిల్లలా కనిపించింది.

ఉండుండి పాట మొదలెట్టాడు తను, కూనిరాగంతో. రాధకూడా పాట మొదలెట్టింది.

"పాటలుకూడావచ్చన్నమాట! చెప్పావుకాదు!" అన్నాడు తను. పాట ఆపేసి.

రాధ తలెత్తి తనవంక చూసి "మీ పాటకంటె ఏం తీసిపోలేదులెండి" అంది సన్నటి చిన్న పెదాలను ముడుచుకుంటూ.

"మరి నువ్విలా మూతి ముడుచుకుంటే ఉన్న ఆ కాస్త నోరూ మాయమైపోతుందేమో జాగ్రత్త" అన్నాడు తను.

రాధ తలవంచుకుని మెత్తగా నవ్వింది. చల్లటినీడల్లో నీలపు సెలయేటిప్రవాహం, పట్టుగుడ్డమీద ముత్యాల పురుగులూ స్ఫురించాయి.

"గొప్ప! ఎలాగయితే నేం! వేళాకోళం"– అంటూ తల తాటించింది. వదులుగా వున్న జుట్టు మెడకి తగిలింది.

"అబ్బ. చక్కలిగింతలు—" అన్నాడు తను.

రాధ పకాలున నవ్వింది. ఇంకా గిలిగింతలు పెట్టింది.

గాలి జోరుగా వీచింది. చెట్టు మీద ఆకుల్లో అణిగివున్న నీటిచినుకులు టపటప రాలాయి. ఒక బిందువు రాధ నుదుటిమీద నిలిచింది. ఆ నీటిబొట్టు వెన్నెల కాంతిలో తళుక్కున మెరసింది. రాధ ఒకమారు జలదరించింది.

'చలా?' అన్నాడు.

అందంగా మెల్లిగా తల ఊపింది. చూపుడు వేల్తో ఆ నీటిబొట్టుని అద్దాడు తను.

రాధ మెల్లగా తలెత్తిచూసింది. తేలిగ్గా రాధ బుగ్గని పెదిమల్తో స్పృశించాడు.

కొంతసేపు తర్వాత రాధ పెదిమలు తన మెడకి చల్లగా తగిలాయి.

క్షీరసాగరోద్భూతమైన అమృతంవలె, గోపాలం అంతరంగంలో, ఆనంద లహరి ఆవిర్భవించింది. ఆ సంతోషం, ఆ సౌఖ్యం, అతను భరించలేకపోయాడు.

తను భరించలేని ఈ మహాసౌందర్య ప్రపంచంనుంచి పారిపోవాలి......

నెమ్మదిగా రాధని లేచి లోపలకు పోదామా అన్నాడు.

రాధ కళ్ళుమూసుకునే జవాబిచ్చింది. 'అబ్బ అప్పుడేనండీ. ఇక్కడే హాయిగా ఉంది. ఇదివరకు పొద్దువాలితే ఇటురావడానికి భయపడేదాన్ని. ఇన్నాళ్ళకి వచ్చి...'

'పెరట్లోకి రావడానికే అంత భయమా!' అన్నాడు తను – వెక్కిరింపుగా.

'ఇంక లేదులెండి. మీరు దగ్గిరుంటే నాకేం భయం? ఆఖరికి జలుబుచేస్తుందని కూడా బెంగలేదు!'

ఇద్దరూ పకపకా నవ్వుకున్నారు.

* * *

గోపాలం పూర్తిగా పశ్చాత్తాపపడ్డాడు. తనమీద రాధ కెంతో విశ్వాసం ఉంది. ఛా! తనింత చవట అని రాధ కల్లోకూడా అనుకుని ఉండదు. ఎంత భయపడుతోందో! ఎంత ఏడుస్తోందో! ఏవగించుకుంటూందేమో!

నాయుడుబావనీ నారాయణమ్మనీ ఇందాక రైల్లోంచి రాధకూడా చూసే ఉంటుంది. దానిక్కూడా అన్నీ జ్ఞాపకమొచ్చిఉంటాయి.

---

మందమతి ప్రొఫెసరుగారు భార్యాసమేతంగా పల్లెటూరు పెళ్ళికి వెళ్లారు. ఇంటికి తిరిగొచ్చిన తరువాత.

మం: ప్రొ: ఏంవే, ఎప్పుడూ నన్ను మందమతి అంటావుగాని నీ అంత మందమతి ఉండనే ఉండదు. చూడు, పెళ్ళికి వెళ్ళి నీగొడుగు మర్చిపోయావు. నేను యిద్దరిగొడుగులూ కూడా పట్టుకొచ్చేశాను.

భార్య: అసలు మనం గొడుగులు పట్టికెళ్లందే? అయ్యోరామ!

—ప్రతాపరావు, విశాఖపట్నం.

మహాభినిష్క్రమణము

—చిత్రకారుడు: వడ్డాది పాపయ్య, శ్రీకాకుళం.

 

## లహరి



ఆ క్షణాన తను రాధతో ఉండిఉంటే!

ఇప్పుడు తెలిసొచ్చింది గోపాలానికి— ఆ క్షణంకోసం తను సర్వస్వం ధారపోయడానికి కూడా వెనుదీసి ఉండేవాడు కాడని. ఆఖరికి రాధ తెల్లచీర విషయంలో కూడా పట్టుదల వదులుకుని వుండేవాడు.

ఆమాటకొస్తే రాధకి ఎర్రచీర బావుంటుంది. అంతే—పచ్చని రాధ ఒంటిమీద ఎర్రని చీరా నల్లని రవికా ఎంతో బావుంటాయి. తెలచీర కట్టుకోమని తను పేచీ పెట్టాడు కానీ, తెల్లచీర ఏం బావుండదు. తనదే తప్పు.

గోపాలానికి మనస్సు తేలికపడింది, ఆత్మసాక్షాత్కారంతో. ఈసారి రైలు ఆగగానే తను పరిగెత్తుకుని రాధ దగ్గర కెళ్తాడు. క్షమార్పణ కోర్తాడు.

ఇద్దరికీ స్నేహం కలిశాక రాధ నవ్వుతుంది. తనప్పుడు రాధ సన్నటి కళ్ళవంక సూటిగా చూస్తాడు.

* * *

సరస్వతి మహోద్రేకంతో ఆహిరి రాగాన్ని ఆలాపిస్తోంది.

నాదే తప్పులే సరస్వతీ! నువ్వింక వాళ్ల మీద కోపంమాని, మలయమారుతం, చక్రవాకం ఆలాపించు - అన్నాడు బ్రహ్మదేవుడు. సరస్వతి అందంగానవ్వి మలయమారుతం ప్రారంభించింది. [illegible] తృప్తిగా చిరునవ్వు ఉప[illegible].

* * *

నిద్రపోతున్న స్టేషన్లో రైలు ఆగీ ఆగకుండానే గోపాలం ప్లాట్‌ఫారంమీదకి దూకి ముందుపెట్టెకి పరిగెత్తాడు. రాధ కోసం.

తలుపు బార్లాతీసి ఉంది.

'నువ్వే రైటు రాధా! ఎర్రచీరే మంచిది. నేను చవటపని చేశాను. కోపం పెట్టుకోకేం' అంటూ కంగారుగా మాట్లాడుతూ పెట్లో కెక్కాడు గోపాలం.

రెండంగుళాలవెడల్పుగల నల్లటిఅంచుతో

# గొల్ల పిల్లవాడు

## 1

ఐదు వేల సంవత్సరాలకు పూర్వం, గోపాలుడు తన గొల్ల తల్లి యింటి దగ్గర కొచ్చి, వెన్నపూసలాంటి మనస్సుతో తియని కంఠంతో — "అమ్మా! నాకు పాలే!" అనడిగాడు.

అతని తల్లి యశోద బయటి కెక్కడికో వెళ్ళింది. గోపాలుని కేక, ఇతర గొల్లలు విని, తమ పాలకుండల నుండి ఒక్కొక్క గ్లాసుడు పాలు తీసుకొని బయటికి వచ్చారు.

గోపాలుడు తన దగ్గరకు వచ్చిన ఓ గొల్ల దగ్గర పాల గ్లాసందుకొని, పాలను గటగటా తాగాడు!

ఆ తర్వాత, అతడు అడవిలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో విహరించే పక్షిలాగా, పిల్లన గ్రోవి మ్రోగిస్తూ తన గొల్ల మిత్రుల దగ్గర కెళ్ళిపోయాడు.

ఇతర గొల్లలు తమ పాలను త్రాగనందుకు చిన్నబుచ్చుకున్నారు. వారి కళ్ళవెంట కన్నీరు బొటబొట కారాయి.

## 2

ఐదేళ్ళకు పూర్వం గోపాలుడు తన యింటికి వచ్చి బిగ్గరగా — "అమ్మా! నాకు ఆకలేస్తోంది, పాలివ్వు," అన్నాడు.

అప్పుడు తల్లి యింటిదగ్గర లేదు. తన పొరుగింటావిడ దగ్గర కెళ్ళింది. ఆమె తన కొడుకుని అక్కడికే పిలిచింది. ఆమె చెవిలో — అమ్మాయి! మీ యింటి దగ్గర పాలువుంటే ఓ గ్లాసెడివ్వు!" అనడిగింది. కాని, ఆమె స్నేహితురాలు పాలివ్వలేదు. ఇది చూచి గోపాలుడు, ఏడుస్తూ పిల్లనగ్రోవి చేత తీసుకొని గబగబా వెళ్ళిపోయాడు.

తల్లి బొటబొటకన్నీరు కార్చింది.

## 3

ఆ తర్వాత మరి కొంత కాలం గడిచిపోయింది. ఆ చిన్నారి బాలుడు గోపాలుడు తన బంగారు తల్లి వొళ్లో పడుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.' అతని నోరు తడారిపోయింది. పాల బొట్టు కోసం గిలగిల తన్నుకుంటున్నాడతడు.

ఇంట్లో పాలున్నాయి. కాని, ఇంగ్లీషు డాక్టరు చెప్పిన మందులు కొనేందుకు డబ్బులు లేవు. తల్లి అతడ్ని తన మండుతున్న గుండె దగ్గరకు లాక్కొని — "గోపాల్! అల్లరి చేయకు నాయనా! పాలు లేవు!" అంది డగ్గుత్తికతో.

కాని, గోపాలునికి ఆమె మాటలలో నమ్మకం కలగలా. అతడు నెమ్మది నెమ్మదిగా, తల్లికి కనపడకుండా లేచి, పాలకుండ దగ్గర కెళ్ళాడు.

కాని, పాలగ్లాసు నోటి దగ్గర కెళ్ళిందో లేదో తల్లి వచ్చి గ్లాసు లాక్కొని, వాటిని అమ్మకానికి బజారుకి తీసుకెళ్లింది.

తల్లి తిరిగి వచ్చేటప్పటికి బాగా చీకటి పడింది. ఆమె లైట్ స్విచ్ నొక్కింది. ఆ లైటు కాంతిలో గోపాలుడామె చేతిలోని మందు సీసా చూచాడు.

హృదయం తరుక్కుపోయే ఈ దృశ్యాన్ని చూచి గోపాలుడు తన ముద్దుల మురళిని కిటికీగుండా బయటకు విసిరి పారేశాడు. చలువరాతి మీద పడి దొర్లాడుతూ పెద్దగా ఏడ్చాడతడు ఆనాడు.

[హిందీలో సుదర్శన్ రచనకు 'వల్లభ్' అనువాదం]

---

కూసిన తెలతెల్లని చీర కట్టుకుని, నల్లటి రవిక ధరించి, జడలో తెల్లటి పూలు తురుముకొని, కళ్లకి నల్లటి కాటుక పెట్టుకొని, నుదుట ఎర్రని బొట్టు పెట్టుకుని, బుగ్గలకి ఎర్రని కొంతలు(?) తెచ్చుకుని, సొగసుగా మనుష్యులకి వినయం చెప్పి, పెదవులు బిగించి చిరునవ్వు నటిస్తూ, సుఖస్వప్నాలకు కొంచెం నిర్ధారణ కలిపి, శిల్పి చెక్కిన శిలవలె ఎదురుగా నుంచుంది రాధమ్మ.

గోపాలం నిర్విణ్ణుడై పోయాడు. ఆనందంతో కంఠనీరు తిరిగింది. గొంతు పూడుకుపోయింది. మాట తడబడింది. నెమ్మదిగా రాధను పలకరించాడు.

రాధ మెల్లగా తలెత్తి ఇంకా మెల్లగా కళ్ళు తెరిచి చూసింది గోపాలాన్ని.

రెండు చిన్న బాష్పాలు ఆమె కనురెప్పల్లో చెదిరిన కాటుకమధ్య తళుక్కుమన్నాయి.

'రాధా! నాదే తప్పు. నన్ను కొప్పకు(?). కానీ ఏడవకు నా కోసం!' అంటూ రాధ గడ్డం పట్టుకున్నాడు గోపాలం.

గోపాలం చెంపలమీద తన రెండు అరచేతులూ ఆనించి "ఊహూఁ" అంటూ తల అడ్డంగా తాటించింది రాధ.

* * *

— [illegible] —



## సీరియల్ 3

"శారద"

సుదర్శనంగారి బంగ్లాలాంటి ఇంట్లో, ఒకర్నొకరు, నారాల తరబడి కలుసుకోకుండా, ఏడెనిమిదిమంది నివసించటానికి వీలున్నది. పది ప్రత్యేకమైన గదులు. మూడంతస్తులలో ఉన్నాయి. పని మనుషులున్నారు, వంటవాడున్నాడు; ఎవరికేం గావాలన్నా, వాళ్ళ గదులలోకే అన్నీ వొచ్చి పడతాయి. సుదర్శనంగారి కుటుంబంలో ఆయనగాక, ఆయన భార్యా ఆయన మొదటి సంబంధం తాలూకు, ఇద్దరున్నారు; సుదర్శనంగారి రెండవ సంబంధం భార్య కమలమ్మ యువతి; ఆడంబరంగా వుంటుంది. కాని, ఎక్కువగా మాట్లాడే మనిషిగాదు. ఆమె ఆ యింట్లో వుందో లేదో అన్నట్టు, నిశ్శబ్దంగా జీవిస్తూవుంది.

పద్మకి అంతా విచిత్రంగావుంది; ఆమె ఆ యింట్లోకి అడుగుపెట్టి, అయిదుగంటలయినా సుదర్శనంగారు తప్ప ఇంకెవ్వరూ కనపడలేదు; భోజనాలదగ్గిర ఆయన భార్య వాళ్ళ సరసన కూర్చుని భోంచేసిందిగాని, నోరుతెరిచి మాట్లాడిన పాపాన పోలేదు. పద్మవంక కొంత జాలిగా చూసి, హృదయపూర్వంగా ఒక చిరునవ్వు నవ్వి వూరుకుంది. అంతే. భోజనాలైనాక తిరిగి ఆమె మేడమీద తన గదిలోకి వెళ్ళిపోయింది. ఇంతకంటే ఆమె పరిచయం అతిథులకి అబ్బే కలగలేదు. ఈ వింతపరిస్థితి, సుదర్శనంగారికేమీ కొత్తగా తోచినట్టులేదు. అతి సహజం అన్నట్టు ఆయన దీన్నేమీ పట్టించుకోనట్టే వంటకాల రుచులమీదా, పెదవాని పట్నపు జీవనౌన్నత్యం గురించీ, తన వ్యాపార లాభాలను గురించీ, ఎడతెరిపి లేకండా మాట్లాడుతున్నాడు.

ఈ అన్నిటికీ అట్టడుగున, ఈ సిరిసంపదలు, భోగభాగ్యాలకి వెనక, ఆయన మనస్సులో పైవారికి అందని అగాధాలలో ఒక విపరీతమైన శోకం, అగ్నిపర్వతం అడుగున లావా ఉడుకుతున్నట్టుగా, వేధిస్తూనే వున్నది. మెరిసే కళ్ళజోడు కుండా కనపడే ఆయన నల్లని రెండు కనుపాపలలోను ఆ విచారం ఎంత దాచినా దాగక ఒకరవ్వ అప్పుడప్పుడు తొంగిచూస్తూనే వుంది. అయితే, అది ఆయన కుటుంబరహస్యం. దాన్ని ఆయన దాచటం చాలా అవశ్యం; చెప్పకుండానున్నా ఇతరు లెవరూ అర్థం చేసుకోలేకపోవచ్చు.

మధ్యాహ్నం రెండుగంటలప్పుడు, సుదర్శనంగారు, వెంకటయ్యగారూ, పద్మ టిఫిన్ తీసుకోటానికి హాల్లో పీటలు వేసుకు కూర్చున్నారు. పద్మ తల్లి లోపల ఎక్కడో వుంది.

వెంకటయ్యగారు, రవ్వకేసరి నంజుతూ, "మీకో అమ్మాయి వుండాలి గదూ" అని ప్రశ్నించాడు సుదర్శనంగార్ని. పద్మ అకస్మాత్తుగా, సుదర్శనంగారివేపు చూసింది. ఆయన మొహం ఎందుకో గాని కొంచెం, వికారంగా నల్లగా మారిపోయింది. ఒక క్షణం; మరుక్షణమే, ఆయన "అబ్బ ఎంత ఉక్కపోస్తూవుంది!" అంటూ, "ఓరేయ్ రాముడూ! ఆ ఫాన్ వెయ్యరా" అని పనిమనిషిని కేకవేసి, "మా అమ్మాయేనా! దానికి సుస్తీగావుంది అన్నయ్యా! లేవలేకుంటేదు." అని ఆ సమస్యను ఎగరగొట్టేశాడు.

ఏమిటిది? ఆ అమ్మాయిని తమకెందుకు పరిచయం చెయ్యడు ఈయన? ఒకవేళ సుస్తీగా వుంటేమాత్రం ఆమెను చూస్తే ఏంపోయింది? అని పద్మ ఆలోచిస్తోంది.

హాల్లో గోడగడియారం మూడుకొట్టింది.

పద్మ గుండెలు జల్లుమన్నాయి బయట సైకిల్ రిక్షా గంటలు గణగణమన్నాయి. రేడియోలో ఎవరో మలయమారుత రాగంలో ఓ కృతి ఆలాపిస్తున్నారు. పద్మ లేచి, వెళ్ళబోయింది. సుదర్శనంగారు, "ఊహూం వెళ్ళకమ్మా! ఆయన వస్తున్నాడు" అన్నాడు-భద్రయ్యగార్ని ఎదురువెళ్లి తీసుకు రావటానికి తను లేచి, బైట వాకిలి దగ్గిరకి వెళ్తూ. పద్మ నేలవంకో, తప్పితే కిటికీల గుండా రోడ్డుమీదకి చూస్తోంది.

రోడ్డుమీద దుమ్ము సుడులు సుడులుగా వడగాలితో పాటు లేస్తోంది. మనుషులు తొందర తొందరగా నడుస్తున్నారు. నగరంలోని సందడి ఇప్పుడు వాన కురుస్తున్నట్టే వినపడుతూ, తొరస్థాయిలో వినపడుతోంది. రకరకాల వాళ్ళు వెళ్తున్నారు ఆమె దృష్టి పథంలించి. పొడుగు లాల్చీలవారు, నెరిసిన జుట్టు మనుషులు; పొడుగాటి గడ్డాలవారు; యోగులు, సన్యాసులు...

సుదర్శనంగారి వెనక, భద్రయ్యగారు కౌతుకంతో చూస్తూ లోపలికివచ్చి, పాలుమున్నా నుంచి బల్లదగ్గిర కుర్చీలో కూర్చుని పద్మవంక చూడసాగారు.

పద్మ, ఆయన్ని చూడాలని తలతిప్పిన ఆ నిమిషాన అయినకూడా, ఆమెవంక తీక్షణంగా చూశారు. జీవితంలో, తమకింక మిగిలిన కాలాన్ని ఒకరితో ఒకరు గడుపవల్సిన ఆ ఇద్దరూ ఆ మాపులోనే ఒకర్నొకరు, అంచనా వేసుకున్నారు.

భద్రయ్యగారి ఎదట, వయ్యారంగా యౌవనప్రాంగణంలో అప్పుడే అడుగు

# మంచి - చెడూ



పెద్దా, సన్నగా, కొంచెం పొడుగ్గా, ఆకు పచ్చని వాయిల్ చీర, వాయిల్ రవిక, తొడిగి, నల్లని పొడుగాటి నిగనిగలాడే జడ చివర ముదురు ఆకుపచ్చరంగు రిబ్బన్ కట్టి నేలచూపులు చూస్తూ అమాయకురాలైన యిరవై ఏళ్ల యువతి నిలబడివుంది నిజానికి ఆయన ఉదయంనించి ఊహిస్తూవున్న రకరకాల రూపాలకు కుడిఎడంగా, ఇంకా మిన్నగాకూడా వుంది. ఆయన మొహం మీద సంతృప్తి మెరిసింది.

పద్మ, ఒక్క క్షణంపాటే చూసినప్పటికీ, ఆమెకు తన కాబోయే భర్తరూపం ఖచ్చితంగా, మనస్సులో హత్తుకుపోయింది తలంతా సగం నెరిసి, సగం నెరవక, గతించిన యౌవనాన్ని, వస్తూవస్తూవున్న వార్ధక్యాన్ని చాటుతోంది. విశాలమైన నుదురు, పొడుగాటి ముక్కు, ఉబ్బిన బుగ్గలు, స్థిరంగా అనుపించే పెదాలు, నల్లగా తెల్లగా నిగనిగలాడుతున్న మీసం; కళ్ళు అగాధాల్లాగా వున్నాయి వాటిని చూసి, ఆయన ఉద్దేశాలు తెలుసుకోటం అసంభవం; శరీరం ఇంకా సడలలేదు సిల్కు షేర్వాణి, సిల్కు లాల్చీ, జరీఅంచు పైపంచ వేసుకున్నాడు. అంతా ఉన్నా ఎందుకో నిరాడంబరంగా అగుపిస్తున్నాడు. మంచివాడే సుమా అనిపించి, ఆయన్ని చూడగానే ఎవరికైనా ఆత్మీయత కలుగుతుంది

కాని పద్మ, మనస్సు అంతర్ముఖంగా, ఇంకో మూర్తినిగురించి ఆలోచిస్తున్నది. ఆమెకు, ఈ ఎదురుగావున్న వ్యక్తిమీద, ఏవిధమైన నిరాదరణగాని కలగలేదు ఆమె పిచ్చిగా వూహించసాగింది ఇక పెళ్లి పెటూ తప్పదేమో! తల్లిదండ్రుల దరిద్రానికి తానొక కారణంగా పరిణమించటం ఆమెకెంత మాత్రం ఇష్టం లేదు. కాకపోతే, ఈయనే - ఆ నెరిసిన జుట్టు కాస్త నల్లగా వుండి, మొగంమీద ముడతలు లేకండా, ఆ కళ్లు ఇంకా కొంచెం కాంతివంతంగా, బలంగావుంటే - ఏశక్తి ప్రభావంవల్లగాని ఓ పాతిక సంవత్సరాల వయస్సు తగ్గిపోతే - అని అనుకుంటోంది.

"అమ్మాయి, చూశావా, నచ్చిందా చెప్పమ్మా!" అంటున్నాడు సుదర్శనం గారు. ఆమె సిగ్గు, కలవరపాటూ ఒక్కసారి ఆక్రమించుకోగా, అక్కణ్ణించి లోపలికి వెళ్లిపోయింది. అదే ఆమోదసూచకంగా స్వీకరించారు ఉభయపక్షాలవారు.

భద్రయ్యగారికి ఇష్టమేనని వేరేచెప్పటం ఎందుకు?

సుదర్శనంగారు భద్రయ్యగారి పక్కనే కూర్చుని, పద్మతండ్రినికూడా మధ్యమధ్య ఒకచూపుచూస్తూ, "అమ్మాయికి వొంటిమీద చిన్నం బంగారం లేద్కోయ్. సాయంత్రమే బజారుకెళ్ళి నగలూ అవీ కొందాము" అని ఆ వివరాలు వర్ణిస్తున్నాడు వెంకటయ్యగారి కళ్ళు ఆత్మసంతృప్తితో పులకాంకితమైనాయి. ఆరు వేలరూపాయల నగలు!

భద్రయ్యగారు ఏమాత్రంచలింపకుండా, "సరే లేవోయ్! ఎట్లాగ తీసుకుందాం పైకం పట్టుకురానా వెళ్ళి" అన్నాడు.

"రేపు ఇద్దువుగాని. మళ్ళీ ఏంపోతావు అక్కడికి, నేను ఇస్తాను" అన్నాడు సుదర్శనం, ఇనప్పెట్టె తాళాలు బొడ్లోనుంచి తీసుకుంటూ లోపలికిపోతూ.

## 4

భాస్కర్రావూ, పాండురంగ ఇద్దరు, మొగల్రాజపురంలో ఇంటముందు దిగారు అప్పటికి 10 గంటలయింది సూర్యరశ్మి, త్రిమూర్తి గుహలమీదుగా కఠోరంగా ప్రసరిస్తోంది

భాస్కర్రావు పెళ్లిపందిరినీ, అరుంతల్నీ, ఆపూట కొత్తగావేసిన ముగ్గు చారల్నీ చూస్తూ లోపలికి అడుగుపెట్టాడు. "నేను వెళ్తానోయ్" అని, పదిగజాల దూరంలోనే పాండురంగ తప్పుకుని తన ఇంటికి వెళిపోయాడు భాస్కర్రావు రెండు మెట్లు ఎక్కి వరండాలో అడుగుపెట్టాడు. వరండా వాకిలిగుండా దొడ్డిగుమ్మం వరకూ సరాసరి చక్కగా కనపడుతుంది బావిదగ్గిర దానిమ్మ చెట్టుమీద ఎర్రనిపూలు, బావి చప్టా దగ్గిరనీళ్ళు పోసుకుంటున్న తండ్రీ కనిపించారు అతనికి. అతని మనస్సు అద్దంలాగు నిర్మలంగావుంది రాగద్వేషాలకు అతని హృదయంలో స్థానంలేదు

తన ఇంట్లోకి తాను వెళ్ళటానికి అతను, తన ఇరవైరెండేళ్ల జీవితంలోనూ, మొట్టమొదటిసారి జంకాడు; పూరికే ఒక నిమిషంపాటు జంకాడు. అదోక రకం సిగ్గు, బెరుకు మాత్రమే అయితే దానికి కారణం ఏమిటో అతను ఊహించటానికి ప్రయత్నిస్తూ వరండాదాటి లోపలికెళ్లాడు. ఎప్పటిమాదిరిగా, ఆ యిల్లు అతి ప్రశాంతంగా వుంది "నాన్నా" అని పిలిచాడు కొంచెం గట్టిగా మధ్య హాలులో నిలబడి

"భాస్కరం! ఎప్పుడురా రావటం!"

అంటూ భద్రయ్యగారు లోపలికి వచ్చాడు. ఆయన ముఖాన, స్నానంచేసి వస్తున్న గుర్తుగా తడి తుంపరలు అక్కడక్కడా వున్నాయి. కొడుకును అకస్మాత్తుగాచూసిన ఆశ్చర్యం ముఖమంతటా ఆదరించివుంది

భాస్కర్రావు తండ్రి ఆశ్చర్యాన్ని గుర్తించి, "నిన్ననే శెలవలిచ్చారు నాన్నా, వెంటనే బయల్దేరాను ఉత్తరం రాయటానికైనా తీరిక దొరకలేదు" అన్నాడు. తనంతట తను, పెళ్ళివిషయం కదపటం, తండ్రి కేమైనా బాధ కలిగించవచ్చు ననుకున్నాడతను.

భద్రంగారికి ఏమీ తోచటంలేదు. ఎదిగిన కొడుకు. పెళ్ళిసంగతి చెప్పకండా పెట్టకండా చేసుకున్నందు కేమైనా బాధ పడతాడేమో! ఆయన నీళ్ళు నములుతున్నాడు. అయినా, కొంత వ్యవధి తీసుకుని, ఆలోచించి, తీరికగా చెప్తే సరిపోతుంది. "లే, లే, నుంచున్నావేం? ఆ బట్టలు విప్పి స్నానంచేసిరా, భోంచేద్దాం!" అన్నాడాయన తన ఆందోళన పైకి కనపడకండా దాచి.

భాస్కర్రావు మౌనంగా, తన గదిలోకి వెళ్ళాడు అతని గది హాలుకి ఎడం వేపున్నది. గది కిటికీగుండా, హాలులోకి చూడవచ్చును భాస్కర్రావు తనగదిలో టేబుల్ మీద పెట్టెను పడేసి, ఒకసారి బరువుగా శ్వాసవిడిచి, కుర్చీలో కూర్చుని, ఆలోచనలను తిరగవేసుకొంటూ, హాలు వేపు కిటికీగుండా శూన్యంగా చూడసాగాడు ఇంకా అంతా అయోమయంగా వుంది; అయినా నాన్న ఈ భాగ్యాని కింత దాచనవసరంలేదు. ఆయన పెద్దవాడు ఆలోచించే చేయగలవాడు. ఆయన తను చేసిన పని కింత దాపరికం చూపటమేమిటి? దేనికి?

భాస్కర్రావు దృష్టిపథంలో ఓ చామనచాయ అమ్మాయి,, పొడుగ్గా, ఆకాశ నీలంరంగు సిల్కు చీర, రవికె తొడుక్కుని, ఎర్రని రిబ్బను, పొడుగాటి జడ చివరన ముడేసుకుని, ఇతని వేపు కనురెప్పపాటు కాలం చూసి, కిటికీ అవతలకి వెళ్ళిపోవటం కనిపించింది. తృళ్ళిపడ్డాడు భాస్కర్రావు. ఈ మేనా - తన పిన్ని! లేక పెళ్ళికి ఇంటికి వచ్చిన బంధువా?.. ఇంత లేతవయస్సుదాన్నా నాన్న పెళ్ళాడినది! ఎంత దారుణం! ఛా ఛా అయివుండదు...అతనికి నమ్మకం కలగటం లేదు.

ఎంతో, వొయ్యారంగా, ప్రతి అవయవంలోనూ యౌవ్వన ప్రాదుర్భవం తొణికిసలాడుతూ, దొడ్లో దానిమ్మ పువ్వులాగే, మెరిసి, మాయమైంది ఆమె. భాస్కర్రావు, వెంటనే లేచి తలుపుదగ్గరకొచ్చి, హాల్లోకి తొంగిచూశాడు. ఎవరూ కనపడలేదు. నిరాశచేసుకుని, స్నానానికి బయల్దేరాడు, తువ్వాలు భుజాన వేసుకుని.

స్నానం చేస్తున్నంత సేపూ, గదిలోకొచ్చి దుస్తులు మార్చుకుంటున్నంత సేపూ, అదే చింతన. మళ్ళీ భద్రయ్యగారు కేకేశాడు భోజనానికి. భాస్కర్రావుకి నిజంగా, చాలా ఆకలివేస్తున్నది. అయినా ఎందుకో గదివిడిచి బైటికిపో బుద్ధికావటం లేదు. కనీసం భోజనాల దగ్గరైనా, నాన్న పిన్నిని తనకు పరిచయం చెయ్యకపోతాడా అనుకుంటూ అతను, తెల్లని మల్లుపంచె కట్టుకుని, వొంటిమీద తువ్వాలు కప్పుకుని, వంటింటివేపు వెళ్ళాడు. హాలుకీ, వంటింటికీ మధ్యవున్న పొడుగాటి గదిలోనే భోజనాలు చెయ్యటం అలవాటు. మామూలుగా, రెండు పీటలువేసి, రెండు చెంబులతో నీళ్ళు పెట్టివున్నాయి. భాస్కర్రావు, రెండో పీటమీద కూర్చున్నాడు మొదటి పీటమీద భద్రయ్యగారు కూర్చున్నాడు. విస్తళ్ళు వెయ్యటానికి మామూలుగా, భాస్కర్రావు మేనత్త వొచ్చింది; ఆమె చిన్నప్పుడే భర్తను పోగొట్టుకుని భద్రయ్యగారింటికి వచ్చేసింది. దాదాపు పదేళ్లనించీ ఇక్కడే ఉంటూంది. ఆమె, భాస్కర్రావును, కన్నకొడుకులాగే ప్రేమిస్తూ, తల్లిలేని లోటు ఏ కోశానా కనపడనీయకుండా, కాపాడుతూ వచ్చింది ఆమె పోలికలన్నీ భద్రయ్యగారికి మల్లేనే వున్నాయి, దాదాపు 40 ఏళ్లుంటాయి

భాస్కర్రావు తన మేనత్తయినా, ఏమైనా చెబుతుందేమో అని ఆమెవేపు ఆశగా చూశాడు. కాని ఆమె మాట్లాడకుండా వడ్డిస్తోంది ఒకటి తర్వాత ఒకటగా తండ్రీ కొడుకులిద్దరూ మౌనంగా భోంచేస్తున్నారు- అవసరమైతేసంజ్ఞలతోటే సరిపెట్టుకుంటూ.

భద్రయ్యగారి కెందుకో తన కొత్త భార్యని, తన కొడుక్కు పరిచయం చెయ్యటానికి, ఇంకా వ్యవధికావాలనిపిస్తోంది. కారణం ఆయనకే తెలియటం లేదు.

భాస్కర్రావుకు వ్యూహాపథంలో సృష్టించుకున్న పిన్నిమీద, గౌరవం క్షణక్షణం పెరుగుతూ వుంది అతని జ్ఞాపకాల మధ్య తల్లిరూపం, పిన్నిరూపం కలగలుపుగా కనపడుతున్నాయి వాటికి పక్కన, ఇందాక చూసిన అమ్మాయి రూపంగూడా వుంది. అయితే, ఆమెపిన్ని - అని అతను అంత సులభంగా అంగీకరించలేక పోతున్నాడు. కారణం? అతని ఊహల్లో అతని గౌరవాన్ని పొందిన రూపం వేరు; ఈ అమ్మాయిరూపం వేరు తన చెల్లెలు బ్రతికి వుంటే ఆమె ఇంత వుండేది

# ★ మంచీ-చెడూ ★

ఈ పరిస్థితి, తండ్రీ కొడుకులు ఉభయులకీ దుర్భరంగా వుంది. వాళ్ళకే అర్థం కాని, ఒకరకం ఆందోళన, వాళ్ళల్లో పెరిగి పోతోంది. "ఎప్పుడు చెబితే మంచిద"ని తండ్రీ "ఎప్పుడు చెబుతాడా"అని కొడుకూ నిరీక్షిస్తున్నారు.

భాస్కర్రావు, భోజనం పూర్తయినాక మళ్ళీ తన గదిలోకి వెళ్ళిపోయినాడు. తనంతట తనే తండ్రిని "పిన్ని ఏదినాన్నా" అని అడగటానికి అతనికి ధైర్యం చాలటంలేదు. అతను గదిలో కూర్చుని, తన ప్రయాణపు పెట్టె ఊడదీసి, ఇందాక తాను పెళ్ళికి బహుమతికోసం కొన్న చీరె పంచెల చాపు అన్నిటికీ మిన్నగా తాను ఉభయులకీ ఇవ్వదల్చినకృష్ణవిగ్రహాన్ని తీసి బయటపెట్టాడు. ఆ కృష్ణవిగ్రహం పింగాణీది. ముద్దుగా పారాడుతున్న బాలకృష్ణుని బొమ్మ అది. అలౌకికమైన చిరునవ్వు ఆ చిన్నికృష్ణుని మొహంమీద లీలగా మెరుస్తోంది.

అసలింతవరకూ పెళ్ళిప్రసక్తే రాలేదు గదా, వీటిని నాన్నకీ పిన్నికీ బహూకరించే దెప్పుడు? నాన్న వీటిని చూసి ఏమనుకుంటాడో! 'ఎట్లా తెలిసింది నీకు' అని అడుగుతాడేమో! అని పరిపరివిధాల ఆలోచిస్తున్నాడు భాస్కర్రావు.

భాస్కర్రావు ఇక ఈ ఆలోచనలని ఆట్టేసేపు భరించలేక, గదిలో మంచం వాల్చుకుని పడుకున్నాడు ఓ కునుకు తీద్దామనుకుని యెండాకాలం కావటంచేత గదిలో విపరీతంగా వుక్కపోస్తోంది తోటవైపుకిటికీలోనుంచి, వచ్చనివడగాలివీస్తోంది. ఆ కిటికీలోనుంచి పచ్చని వేపచెట్టు గాలికి దెయ్యం వూగినట్టు వూగుతోంది. భాస్కర్రావు మొహంమీద నిద్రమగతలు అవరిస్తున్నాయి. ఆ మగతలోనే మొదట తల్లీ, ఆతర్వాత ఆస్థానంలోనే ఇంకో విచిత్ర రూపం కనిపించాయి. ఈ కొత్త రూపం యౌవ్వనప్రాయంలోనూ, ఆమె ఆత్మ నడివయస్సులోనూ ఉంది; ఆమె హృదయం వాత్సల్యప్రపూర్ణంగా, శరీరం కోమలంగా కనిపిస్తున్నాయి;...

భాస్కర్రావు గాఢనిద్రలో పడిపోయాడు. అతడికి కలలులేని సుషుప్త్యావస్థ వొచ్చేసింది. నిద్రలేచేసరికి 3 గంటలవుతుంది. దుస్తులు సరిచేసుకుని, బైటికి వచ్చాడు. దొడ్లోకి వెళ్ళి మొహం కడుక్కుని హాల్లోకి వచ్చేసరికి, తండ్రి అక్కడ పడకకుర్చీలో కూర్చునివున్నాడు; ఆయనముందు టేబిల్ మీద రెండుకప్పులలో కాఫీ, వేడివేడిగా పొగలు కక్కుతూ సిద్ధంగా వుంది. కొడుకుతోపాటు కలిసి తాగుదామని కూర్చున్నట్టున్నాడాయన.

"ఇటు కూర్చోబాబూ" అని ఆప్యాయంగా పిలిచి తనపక్కనే కూర్చోబెట్టుకున్నాడు భాస్కర్రావును. భాస్కర్రావు ఇంకా నిరీక్షిస్తున్నాడు, తండ్రి పిన్నిని పరిచయంచేసేఘడియకోసం. "కాఫీ తీసుకో నాయనా" అన్నాడాయన భాస్కర్రావు మాట్లాడకుండా, కాఫీ చప్పరిస్తూ కనిపిస్తున్నంతమేర చుట్టూ చూస్తూన్నాడు. అవే పరిచయమైన తెల్లని గోడలు; వాటి నిండా వరసగా రకరకాల పటాలు. హాలు రెండువేపులా రెండేసి గదులు; ఆకుపచ్చని రంగువూసిన తలుపులు. సూటిగా దొడ్లో దానిమ్మచెట్టు - ఎర్రనిపూలు. భోజనాల గదిలో మేనత్త కూర్చుని కుంపటి విసురుతోంది. ఏదోవండుతోంది గావును, మంచి నెయ్యి వాసన ఘుమఘుమలాడుతో, నోరూరిస్తూంది.

కాఫీ తాగటంఅయినాక భద్రయ్యగారు ఇనప్పెట్టె తాళాలు కొడుకుచేతికిస్తూ, "నాన్నా, పెట్టెలో ఆరువేల రూపాయలు కట్టకట్టి వుంచాను. మూడో సొరుగులో - పట్టుకెళ్ళి సుదర్శనం మామయ్యకిచ్చిరా. వస్తూవస్తూ, దుర్గగుడికిపోయి, విభూతీ, కుంకుమ పట్టుకురా. ఇవ్వాళ శుక్రవారం కదూ? మనపేరూ, గోత్రం చెప్పి సహస్రార్చన చేయించు. మరిచిపోకు" అన్నాడు లాలనగా. భాస్కర్రావు, లేచాడు. ఇనప్పెట్టె అతని గది కెదురుగావున్న గదిలో వుంటుంది. పదినిమిషాలకల్లా అతడు పైకం తీసుకుని, నాన్నతో చెప్పి వెళ్ళిపోయాడు బయుటకి.

## 5

పెళ్ళినాటి మొదటి రాత్రే భద్రయ్యగారికి పరీక్షగా పరిణమించింది. రాత్రి పన్నెండు దాటింది; బంధువులందరూ ఎక్కడివారక్కడ నిద్రతూగుతూ ఎక్కడ బడితే అక్కడ పడి నిద్రపోతున్నారు ఒక మూల ఫలహారాల్ని పిల్లి భక్షిస్తోంది. ఎలక్ట్రిక్ దీపాలన్నీ జాజ్వల్యమానంగా వెలుగుతున్నాయి. ఎవరో ఒకరిద్దరు ముత్తైదువులు మాత్రం మేల్కొని పెళ్ళికూతుర్ని కార్యం గదిలో ప్రవేశపెట్టే పవిత్ర కార్యక్రమంలో నిమగ్నలై వున్నారు. భద్రయ్యగారూ, సుదర్శనంగారు ఇంకో ముసలాయనా నవ్వుకుంటూ ఏదోమాట్లాడుకుంటున్నారు. పైకిమాట్లాడుతున్నాడన్నమాటేగాని భద్రయ్యగారు ఇంకో పదినిముషాలలో కలుసుకోబోతున్న వధువుగురించేఆలోచిస్తున్నాడు. జీవితంలో రెండోతడవ, మొదటిరాత్రి లభించింది అదృష్టవశాన అది మనసార అనుభవించటానికి సిద్ధపడుతున్నాడాయన.

ఒక ముత్తైదువ, నడివయస్సుగలదే, కొంత లజ్జ అభినయిస్తూ వాళ్లు కూర్చున్నచోటికి వచ్చి, "పిలుస్తున్నారు" అంది గోడమీద పరాలకేసి చూస్తూ.

సుదర్శనంగారు తన స్నేహితుని చెయ్యిగిల్లి "వెళ్ళవోయ్, పెళ్ళికూతురు తొందర పడుతోందట! "అన్నాడు. భద్రయ్యగారు మెల్లిగా లేచి సుదర్శనంకేసి ఒకసారి అయోమయంగా చూసి ఆ ముత్తైదువను అనుసరించాడు. ఇనప్పెట్టెగదికి పక్కనే వున్నగది పడకగదిగా అలంకరించబడింది. భద్రయ్యగారు గుండె కలకత్తా మెయిల్ వేగంలో స్పందిస్తూవుండగా మౌనంగా గదిలో ప్రవేశించాడు. తలుపు బయట గొళ్ళెం పెట్టారు పెద్ద ముత్తైదువలు. భద్రయ్యగారు పద నిమిషాలపాటు అలాగే తలుపుకానుకుని నిలబడి పోయాడు. ఆయన వొళ్ళంతా ఎందుకోగాని చెమట పోసింది. కాళ్ళు వణికిపోయినై ఆయన ఒకసారి తన ధైర్యాన్ని పూర్వస్మృతుల బలంతో కూడదీసుకుని గదిఅంతా కలయజూశాడు. ఆగది ఆయన సంవత్సరాలతరబడిగా రోజూ వస్తున్నదే. అయినా అదంతా కొత్తగా వింతగా వుందిప్పుడు ఆయనదృష్టికి పెద్దపట్టెమంచం; దానిమీద తెల్లని మల్లెపువ్వులాంటిపరుపూ, ఎర్రటి అంచుకుట్టిన నల్లని వెల్వెట దిండ్లు; మూడువేపులా వేళ్ళాడుతూ ఒకవేపు పైకి తీసి వుంచిన తెల్లని దోమతెర. మంచం

కాళ్ళకట్టన పద్మ తలొంచుకుని నిలబడి వుంది; ఒక చేత్తో దోమతెరచట్రం పట్టుకుని రెండో చెయ్యి మంచానికి ఆనించి నిశ్చలంగా నిలబడి వుంది. భద్రయ్యగారు తలుపు దగ్గిరనుంచి కదల్లేదు.

మంచంతలాపున ఫలహారాల పళ్ళెంనిండా లడ్లూ అరిసెలు పాలకోవా పెట్టివున్నాయి. భద్రయ్యగారు వాటివంక విరక్తిగా చూస్తున్నాడు. పెళ్ళికొడుకన్నవాడు కార్యం నాటిరాత్రి పీటలో సగమైనా తానుతిని కొంత పెళ్ళానికివ్వాలి. కాని - తను వాటిని తినగలడా? సంవత్సరంక్రితం తాను దారుణమైన కడుపు నొప్పితో బాధపడి డాక్టర్ దగ్గిరకి వెళ్ళింది లగాయతు రెండు పూటలా తేలికగా భోజనం కాఫీనీళ్లు తప్ప ఇంకేమీ తినలేకుండావున్నాడు అదయినా వేళకి భోంచెయ్యాలి. లేకపోతే అరగదు. పైగా - భద్రయ్యగారికి తాను రోజూ రాత్రి పడుకునేముందు తాగవల్సిన ఆ వుప్పుమందు జ్ఞాపకానికి వచ్చింది పెళ్ళి సందట్లో మరిచిపోయ్యాడు. అదితాగకపోతే తెల్లారకట్టకల్లా కడుపునెప్పి ఆరంభిస్తుంది. ఆ మందు కూడా మంచంతలాపున అలమారాలోనే వుండాలి. అది తాగకుండా వుండి ఆ కడుపునెప్పి భరించటం ఏపరిస్థితిలోనూ అసంభవం అవివేకం కూడాను.

గది అంతటా నిన్నగాక మొన్న నీలంరంగు సున్నం కొట్టించాడు. గదిలో వెలుగుతున్న ఎలక్ట్రిక్ బల్బుకూడా అదే రంగుది వేయించాడు. అందువల్లనే కాబోలు వెన్నెల ప్రసరిస్తున్నట్టు భ్రమ కలిగిస్తోంది అక్కడి వెలుగు దానికి తోడు పెళ్ళికూతురి తలలో విచ్చిన మల్లెపూలమైకంగొల్పే కమ్మని వాసనలు, ఫలహారపు బల్లమీది సాంబ్రాణి వత్తుల పొగలు కలిసి భద్రయ్యగారికి నిద్రవచ్చేట్టు చేస్తున్నాయి. ఆయన ఇలాంటి వాతావరణం మరిచి ఏ ఎనిమిది సంవత్సరాలైనా అయివుంటుంది తోటవేపు తెరిచివున్న కిటికీగుండా లోపలికి ధారాళంగావస్తున్న గాలికి పందిరిమంచం దోమతెరా పెళ్ళికూతురి పైట చెంగూ కదుల్తున్నాయి.

భద్రయ్యగారు రెండడుగులు వేశాడు మంచంవేపుకి. తన శక్తినంతా కూడదీసుకుంటున్నాడాయన నిజానికి ఆయనకు శరీర దార్ఢ్యం ఇంకా సడలిపోలేదు. కాని ఈ క్షణాన ఆ శక్తంతా ఏమైపోయిందో ఆయనకే అర్థం కావటంలేదు ఆయనలో అట్లా చెయ్యాలి, ఇట్లా వుండాలి అన్న కోర్కెలు బలీయంగానే వున్నాయి కాని వాటి ప్రోద్బలంవల్ల ఆయన నరాలలో రావల్సిన బిగువు అణుమాత్రమైనా రావటం లేదు ఆయనరక్తం చల్లబడిపోతోంది క్షణక్షణానికీ మెదడుమాత్రం విపరీతంగా పని చేస్తోంది. దాని లయకు సరైన స్థాయిలో హృదయంకూడా స్పందిస్తోంది దారుణంగా.

ఆయన సరాసరి మంచం తలాపుకి వెళ్ళి గోడకివున్న అల్మారా తలుపులు తెరిచాడు. అందులోంచి తన మందుసీసా తీసి దొంగకు మల్లే కొంత ఆందోళన పడుతూనే నిదానంగా ఒక మోతాదు మందు నోట్లో పోసుకున్నాడు; అప్పటికి ఆయన మనస్సు సంతృప్తిపడింది. నోరేమో వుప్పగావుంది గుక్కెడు మంచినీళ్ళు తాగాలి నీళ్ళు ఎక్కడవున్నాయో! భద్రయ్యగారి మెదడులో ఒక ఆలోచన మెరిసింది; పెళ్ళికూతుర్ని సంబోధించి మంచినీళ్ళు తెమ్మంటే? రెండు నిమిషాలు తటపటాయించాక మంచం తలాపునించి నాలుగు అడుగులు కాళ్ళకట్టవేపు జరిగి మెల్లెగా, "కాసిని మంచినీళ్లు కావాలి" అన్నాడు ఎట్లాగో తెగించి. అదయినా—ఆమె వేపు చూడకండా తెరిచివుంచిన అలమారా కేసి చూస్తూ.

పద్మ కదిలింది; చుట్టూ చూసింది. ఫలహారాల పళ్ళెంవున్న బల్లమీద కంచు మరచెంబు నిండా మంచినీళ్లు వుంచారు ముత్తైదువులు; ఆమె మెల్లగా నడిచివెళ్ళి ఓ గ్లాసెడు మంచినీళ్ళు వొంపుకొచ్చి భర్తకి అందించింది, నేలచూపులు చూస్తూ. ఇందాకణ్ణించీ ఆమె తన భర్త ప్రతి కదలికనూ ఓరగంటితో గమనిస్తూనేవుంది.

భద్రయ్యగారు ఆమె చేతిలోగ్లాసు అందుకుంటూ ఎడంచేత్తో ఆమె రెండో చేతిని లాలనగా పట్టుకున్నాడు. ఆమె స్పర్శ చల్లగావుంది. అటువంటి రాత్రివేళ యౌవనవతియైన స్త్రీ స్పర్శ కలిగించగల ఏ వుద్రేకమూ చలనమూ ఆయనకి కలగలేదు; నోటి వుప్పదనం వేధిస్తూవుండడంవల్ల ఆయన రెండుగుక్కల నీళ్లు నోట్లో పోసుకుని మింగి మంచంమీద కూర్చున్నాడు. ఆయన చేతినుండి ఆమె చెయ్యి జారిపోయింది. పద్మ ఎక్కడ నుంచుందో అక్కడే శిలావిగ్రహంలా నిలబడివుంది తల వొంచుకుని కోర్కెలు ప్రోత్సహిస్తూవుంటే మళ్ళీ ఓసారి ఆ యువతిని ఆపాదమస్తకం చూశాడాయన ధైర్యం చేసి. మల్లెపువ్వులాంటి తెల్లని చీరె; జరీ అంచు. లేత గులాబీరంగు రవికె; నల్లని పాములాంటి పొడుగాటి జడ. మల్లెపూల చెండు, నల్లని ఆకాశంలో చంద్రుడులాగా కనిపిస్తోంది. వొంచుకున్న తల కుడివైపు మృదువైన, బుగ్గ, సన్నగా కొనతేలిన చిన్న గడ్డం. వాలిన బరువైన కనురెప్పలు. బుగ్గమీద ఒకటి రెండు జుట్టు వుంగరాలు కిటికీగాలికి వూగుతున్నాయి.

భద్రయ్యగారు తిరిగీ చెయ్యిచాచి ఆమెని దగ్గిరకి లాగాడు కదలలేదామె. పెనుగులాడింది. భద్రయ్యగారికి ధైర్యం సడలిపోయింది. కళ్లు నిద్రలేమితో అనుభవాలకిక అనర్హమన్నట్టుగా బిగువు తగ్గిన శరీరంతో ఆయనకి విరక్తి కలుగుతోంది. ఆయన చేతిలో నలుగుతున్న ఆమె పొడవైన వేళ్లు అగ్నిలాగా మండవల్సిందిపోయి జడపదార్థంలాగా మంచుగడ్డలా వున్నాయి. భద్రయ్యగారికి కళ్ళు మండుతున్నాయి. ఎంత కూడదనుకున్నా బలవంతంగా స్నేహితులు తినిపించిన రాత్రి భోజనం నిద్రకు మరింత ప్రోద్బలమిచ్చింది మోతాదు మించిన బలమైన విందుభోజనం, చారెడు కమ్మని నెయ్యి, పప్పు! కడుపులో బరువుగా దేవుతున్నట్టువున్నది భరించలేకపోతున్నాడు నిద్రాదేవి మెల్లి మెల్లిగా ఆయన్ని అతిప్రేమగా, తన ప్రశాంతమైన వొడిలోకి లాక్కుంటూంది ఆయన మెల్లిగా పసిపిల్లవాడిలా, ఒకచేతితో భార్య చెయ్యి ఇంకా గట్టిగా నొక్కి పట్టుకునే, కాళ్ళకట్టదిండుకు ఆనుకుని గాఢ నిద్రలో పడిపోయినాడు.

పద్మ మెల్లెగా తన చెయ్యి విడిపించుకుని చల్లగా రెండడుగులు జరిగి నేలమీద చెంగు పర్చుకుని పడుకుంది ఆమె మనస్సు నిర్మలంగా శూన్యంగా వుండడం చేతనే గాబోలు, మరొక్క ఐదునిమిషాలల్లా ఆమె కూడా నిద్రలో పడిపోయింది; ఆమె ఈ మైకంలో తన భర్త తిరిగి యౌవనం పొందినట్టు, నెరిసిన తల నల్లబడ్డట్టు, అతని చేతులు తిరిగీ బలం సమకూర్చుకున్నట్టు, ముఖం మీద వయస్సు ముద్రించిన ముడతలు మాయమై ఆస్థానే వచ్చీరాని మీసం, అమాయకత్వం వెలిబుచ్చే నున్నని ముఖమూ - తనను బిగి కౌగిలిలో వూపిరాడకుండా చేసినట్టూ కలకంటోంది తెల్లారకట్ట మసక వెలుతురుతో పాటే తలుపుతీసి లోపలికి తొంగిచూసి పెళ్ళికూతుర్ని తీసుకెళ్ళటానికి వచ్చిన ముత్తైదువుకు, మంచం కాళ్ళకట్ట తలపెట్టుకుని గురకపెట్టి నిద్రపోతున్న భద్రయ్యగారూ, నేలమీద అమాయకంగా నిద్రపోతున్న పద్మా కనిపించారు.

## 6

సుదర్శనంగారికి పైకం ఇచ్చి, దుర్గగుడికి వెళ్ళి పూజచేయించి ప్రసాదం తీసుకునితిరిగి వచ్చేసరికి భాస్కర్రావుకి ఎనిమిది గంటల రాత్రయింది. కమ్మని త్రయోదశి వెన్నెల గవర్నర్ పేట సెంటర్లోనూ, రోడ్లమీదనూ, పాదరసం బల్బుల అతి నీలి కాంతులతో కలిసి, పట్టపగల్లా వుంది విజయవాడ. అతను కులాసాగా ఈలవేసుకుంటూ వీధి తర్వాత వీధిగా నడుస్తూ బందరు

# ★ మంచీ-చెడూ ★

రోడ్డుమీదికి వచ్చాడు. అన్నీ కొట్లు - ఎక్కడ చూసినా జనం కిటకిటలాడుతున్నారు ఎవరిదృష్టి వారిది, ఎవరి పని వారిదిగా వుంది. ఎవరుగాని ఇంకొకరి విషయం పట్టించుకోరు. ఎనిమిది గంటలు కావస్తున్నా కాఫీహోటళ్ళల్లో జనం కిటకిటలాడుతూనే వున్నారు

భాస్కర్రావు ఇదంతా, పరధ్యానంగా చూస్తూ మొగల్రాజపురం వొచ్చాడు. ఇంట్లో ఎలక్ట్రిక్ దీపపు కాంతివంతమైన వెలుగులో హాలుమధ్య తన మేనత్త, ఇంకో నలుగురు ముత్తైదువులూ, ఓ అమ్మాయి కూర్చుని వున్నారు. పూలు గుచ్చుతున్నారు మాట్లాడుకుంటూ, నాన్న ఎక్కడా కనపడలేదు ఆ అమ్మాయి మధ్యాహ్నంతన కొక క్షణంపాటు కనిపించి మాయమైన వ్యక్తే. భాస్కర్రావు వెనక్కి తగ్గుదాం అని ఆలోచిస్తూ వుండగానే మేనత్త కేకేసింది: "ఎక్కడికి పోతున్నావురా! రా ఇట్లా ఆ విభూతి, కుంకుమ, ప్రసాదం ఇలా ఇయ్యి. మీపిన్ని బొట్టు పెట్టుకుంటుంది" అని అయాచితంగా పిన్నిని అతనికి అకస్మాత్తుగా పరిచయం చేసింది

పద్మ తలెత్తి రెండు నిమిషాలపాటు - తొందరపాటుతోనే తన కొడుకును - అంతేగా!—చూసి చప్పున తలొంచుకుంది. భాస్కర్రావు నిదానంగా ఆమె వంక చూశాడు అతని మనోనేత్రం ముందు ఇందాకటి దాకా, చిత్రించుకుని పూజ చేస్తున్న విగ్రహం అకస్మాత్తుగా చెరిగిపోయి, ఆస్థానే ఈ కొత్త రూపాన్ని ప్రతిష్ఠించుకోవాల్సి వచ్చింది. అయితే అదే గౌరవం, అదే వాత్సల్యం, అదే భక్తి భావం కలిగ యతనికి.

పద్మకి ఒక్క నిమిషం అంతా అయోమయంగా తోచింది. తాను రాత్రి కలలో చూసిన భద్రయ్యగారి యౌవనరూపం ఇదే! భద్రయ్యగారు 'అబ్బాయి వస్తాడు' అన్నప్పుడు ఆమె పది, పన్నెండేళ్ళ అల్లరి కుర్రాణ్ణి ఊహించింది వాడికి చక్కగా నీళ్ళుపోసి తలదువ్వి బొట్టుపెట్టి, తనకు ఆదినించి తమ్ముడు లేనిలోటు తీర్చుకుంటూ వుండవచ్చనుకుంది. పదిఏళ్ళ కుర్రాడు ఇంట్లో ఉంటే ఇక అల్లరికీ ఆగానికీ అంతుండదు. తనకు పొద్దుపోవటానికీ లోటుండదు. కాని ఆ వూహాలన్నీ ఈక్షణాన పటాపంచలైనాయి మధ్యాహ్నం ఆగదిలో పడుకుని వున్న ఇతన్ని చూసి ఎవరో అనుకుంది. చివరికిప్పుడతనే తన సవితి కొడుకు అని నిర్ధారణ ఐంది. పగలల్లా తను మేడ దిగనే లేదు. మేడమీద తనగదిలోనే తన కెంతో ప్రశాంతంగా వుంది

"ఇదిగో - పిన్నీ కుంకుమ, పూలు" అంటూ భాస్కర్రావు చాలా సహజంగా తన చేతిలోపొట్లాలు ఆమెముందు పెట్టాడు. అతనికళ్ళల్లో ఎంతో నమ్రత, జాలి కలగలుపుగా కనిపిస్తున్నాయి.

భద్రయ్యగారుచేసిన ఏర్పాటేఇది. ఆయన పరోక్షాన ఈ సమావేశంఐపోయి, పెళ్ళి వివరం కొడుక్కు తెలిసిపోతే, వాడు దీనికి ఎట్లాంటి ప్రత్యుత్తరం చెబుతాడో తెలిస్తే, ఆతర్వాత తను స్వయంగావచ్చి కలుసుకోవచ్చు. అట్లాగే ఆయన గబగబ మేడమెట్లు దిగివచ్చి, హాలుచివర నుంచున్నాడు. "అబ్బాయి - ఇటురా. నీతో - చెప్పడం ..." ఆగిపోయాడు ఆయన. ఆ వాక్యాన్ని ఎట్లా పూర్తి చెయ్యాల్సిందీ తోచలేదాయనకి.

"తెలుసులేనాన్నా నాకు. పొద్దున బండి దిగివస్తూంటే పాండు చెప్పాడులే" అంటూ భాస్కరం తండ్రిదగ్గిరకి వెళ్ళాడు. భద్రయ్యగారికి గుండె బరువు తగ్గినట్టు అనిపించింది. పద్మ మెట్ల కమ్మీలు పట్టుకుని నిలబడింది. ఆనందంగా కొడుకువంక చూస్తున్న తన భర్తనీ, భర్తపోలికలు పుణికి పుచ్చుకున్న భాస్కర్రావునీ మారిమారి చూడసాగింది వింతగా. ఎవరో తనను దగా చేశారనుకుంది ఒకక్షణం; ఇంకో నిమిషానికల్లా ఆమె అయోమయంలో పడిపోయింది. ఆమెకి తెలియకుండానే లోలోన ఒక ఉద్వేగం అగ్నికణంలా రగుల్కొంది

భాస్కర్రావు తండ్రితో "ఇప్పుడే వస్తాను నాన్నా" అని చెప్పేసి, తన గదిలోకివెళ్ళి వధూవరులకని బహుమతిగా పట్టుకొచ్చిన చీరె, పంచెలచాపు, కృష్ణ విగ్రహం తీసుకొచ్చాడు. ఈలోగా భద్రయ్యగారు హాలుమధ్యకివచ్చి ఓకుర్చీలో కూర్చున్నాడు భాస్కర్రావు స్వతంత్రంగా "పిన్నీ! ఇటొచ్చి నుల్చోండి. ఇద్దరూ వీటిని తీసుకోవాలి" అన్నాడు చనువుగా. పద్మ సిగ్గుతోలేచి నిదానంగా యంత్రచాలితవలె నడిచివచ్చి భర్త పక్కన అడుగుదూరంలో నిల్చుంది. భాస్కర్రావు మొదట పంచెలచాపు నాన్నకిచ్చి, తర్వాత చీరె, రవికగుడ్డ పిన్నికిచ్చాడు. చివరికి పారాడే కృష్ణుడి విగ్రహాన్ని పిన్నికి ఇచ్చాడు. వెంటనే నాన్నకీ పిన్నికీ నమస్కరించాడు. భద్రయ్యగారు నవ్వుకున్నాడు.

పద్మ తన బహుమతులవంక చూసింది.

---

ఒక హాలీవుడ్ సినిమాతార తన చిన్నకుమార్తెకు తన కొత్త భర్తను పరిచయం చేస్తూ "ఈయన మీ కొత్త నాన్న నమస్కారం పెట్టు," అంది.

"అలాగా. నమస్కారం కొత్త నాన్నగారూ! నా ఆటోగ్రాఫ్ పుస్తకంలో ఇంకొక్క పేజీయే మిగిలింది. సంతకం పెట్టరూ?" అని ఆపిల్ల అడిగింది.

---

తనకెంతో ఇష్టమైన కనకాంబరం రంగు కోయంబత్తూర్ చీరె. ఎర్రనిబార్డర్. రవికగుడ్డకూడా అదే రంగు. తన మనస్సునెట్లా తెలుసుకున్నాడీ యువకుడు! ఆ బొమ్మ! ఎంతో అందంగావుంది! అయితే ఆ బహుమతి వుద్దేశం?...ఆమె గుండెలు ఝల్లుమన్నాయి ఆమె లేచి నిలబడి తనవేపు చూస్తున్న భాస్కర్రావును ఓరగంటితో ఒకమారు చూసింది. ఏదో గొణిగింది. గిరుక్కున తిరిగి, తన గదిలోకి వెళ్ళిపోయింది. ఆమె కళ్ళల్లో అప్రయత్నంగా అశ్రువులు కనిపించాయి, రెండు ముత్యాల్లాగు

"ఇంకా కొత్తకదుటోయ్!" అన్నాడు భద్రయ్యగారు ఆమె వెళ్ళాక.

"అవును పాపం. వాళ్ళవాళ్ళెవరైనా పదిరోజులపాటు ఇక్కడే ఉండమనక పోయారా నాన్నా" అన్నాడు భాస్కర్రావు జాలిగా ఆమె వెళ్ళినవేపే చూస్తూ.

"నేను ఉండమనే చెప్పాను వాళ్ళ పనివుందని వెళ్ళిపోయారు ఓ వారం తర్వాత వొస్తానన్నారులే మన సుదర్శనం గారు లేడూ? ఆయన బంధువే మీ పిన్నికి బాబాయి వరస ఆయన 'నేనున్నాలే అమ్మ బెంగపెట్టుకోకు' అని కూడా అన్నాడు. పిచ్చిపిల్ల! నువ్వు అకస్మాత్తుగా పిన్నీ అని పిల్చేసరికి గాబరాపడింది" అన్నాడు తండ్రి తేలికపడ్డ గుండెతో నవ్వుతూ.

నాన్న ఇంత తొందరపడి పెళ్ళిచేసుకోటానికి గల నిజమైన ప్రోద్బలం ఎక్కడ్నించి వచ్చిందో భాస్కర్రావు కిప్పుడు తెలిసింది అతని మనసు కొన్ని గంటలు వెనక్కి వెళ్ళి తన జ్ఞాపకాల్ని తిరగెయ్యసాగింది. అతను తండ్రి దగ్గరనుంచి సరాసరి తన గదిలోకివెళ్ళి పడకకుర్చీలో పడుకుని ఆలోచించ సాగాడు.

[ఇంకావుంది.]

నాటిక:

# కష్టం ఖలు పరాశ్రయః

[కాలం : వర్తమానం; వాతావరణం: మామూలు సామాన్య కుటుంబీకుల ఒంటగది సంసారంకంటె కాస్త రెండు మెట్లు కింద. తెర లేచేసరికి ఓవ్యక్తి స్టేజి ఈచివరనించి ఆచివరకు పచార్లు చేస్తూవుంటాడు. నాలుగు సార్లు అలా తిరిగి ఎడంవేపు వెళ్ళి చేతులు కట్టుకొని ఏదో ఆలోచిస్తుండగా కుడివేపు నించి ఓయువతి చేతులు చీరకొంగుతో ఒత్తుకొంటూ వస్తుంది అవతారమే చెప్పేస్తుంది; అమ్మగారు వంటింట్లోంచి వస్తున్నట్టు. మరి ఆసంభాషణ వింటే వాళ్ళిద్దరు భార్యాభర్తలనే భావం ప్రేక్షకునకి వెంటనే తట్టుతుంది. అతనిపేరు 'క' కారం! ఈవిడపేరు 'ల' కారం. అంటె కనకారావు, లక్ష్మీదేవి లకు హ్రస్వ సుర్తులు.]

లకారం [వస్తూ] ఏమిటి చేస్తున్నారు?

కకారం : ఆలోచిస్తున్నాం [ఆవిడవేపు ఛట్టున తిరిగి] ఆఁ! ఆలోచనకి అంతం దొరికి పోయింది! దొరికిపోయింది ... దొ రి కి, పోయింది...

ల : ఏమిటి?

క : కథావస్తువే, కథావస్తువు. ఇదుగో యిప్పుడే రచన కుపక్రమించేద - పోస్ట్‌లో వేసెద - పది రోజుల్లో ప్రింటు, పత్రం లోపున పారితోషికం!

ల : [లక్ష్యం లేనట్టు] మనకడుపూ నిండి పోయింది! సంబడం — అం తే, కోతికి కొబ్బరిముక్క దొరికినట్టు.

క : అబ్బ! యింత నిరాశావాది వేమిటే?

ల : మరి ఏమిటిది? ఇంట్లో గోడకి కాస్తయినా పట్టించుకోంటాగూ? ఈ కర్రల పొగలో నేను చావలేను మొర్రో అంటున్నా బొగ్గుపొయ్యి కొనుక్కురారు, కూరలు తరుక్కునేందుకింత కత్తిపీట ముక్క లేదంటె అవ్వ! ఎవరైనా వింటే నవ్విపోతారు—

క : అనవ్వే వధవలమీద యుద్ధం ప్రకటించేశక్తి మనకి లేదుగాబట్టి క్షమించి వొది లేస్తున్నా - ఐతే యింతకీ నీ ఫిర్యాదేమిటి?

ల : పాలు లేవు పంచదార లేదు; కట్టెలు లేవు - మళ్లా మూడు పూటలా తైనాతుగా విస్తరముందుకూచొనితే అంటే ఆడది ఎక్కణ్ణించి తెచ్చి ఛస్తుందనే బుద్ధన్నా వుంటుందా?

క : నిజం వుండదు. అసలు అదే వుంటే ఈవెధవ పత్రికా రచనలోకి ఎందుకు దిగుతాను?.. ఆఁ అయితే యింతకీ కుండలదగ్గర నించీ కాఫీ డబ్బావరకు నిండుకున్నాయంటావు. రైటో! నాజేబులోగూడ బీడీలు నిండుకొన్నాయి- మరి నన్నెవరితో మొరెట్టుకోమంటావు?

ల : పత్రికలవాళ్ళతో; ఐతే ఈవాళకి పస్తుంటారా?

క : అబ్బె! అదెలా సాధ్యమవుతుందిలే.

ల : అవును సాధ్యమెలా అవుతుంది? ఇవతల సలక్షణంగా ఏదో ఒక పని చెయ్యమంటె చెయ్యరు...

క : ఏం పని మగువా?

ల . తగ్గించండి అతి తెలివితేటలు. ఇలా నోరెత్తేసరికి హాస్యాల్లోకి దింపుతారు. ఈ వాళకి మూడు రోజులై బియ్యం నిండుకొన్నాయి. ఏదో అప్పు అక్కడా యిక్కడా చేసి నెట్టుకొస్తుంటే, మీరను కొంటున్నారు ఇంట్లో మనం గడించి పాతరేసిన సొమ్ముంది కదా ఫర్వాలేదని.

క : అబ్బె! ఎలా అనుకొంటానే? మీ నాన్న పెళ్ళిలో యిచ్చిన కట్నం అర్ధ నూటపదహార్లేగా?

ల . అంతవరకు మోసపోయి యిచ్చి నందుకైనా సంతోషించండి లేకపోతే వెనక ఏ గిట్యా ముట్యా లేని మీలాంటి ఒంటరి మనిషికి నన్నిచ్చిపెళ్ళి చేయడమే బుద్ధి తక్కువ

క : నువ్వు లేకపోతే నా కెంతో పెళ్ళాలు రానట్టు. ఆమధ్య ఓజమిందారు తన పెద్ద కూతుర్ని మన కాళ్ళమీద పడేస్తామంటూ నాపర్ని కాలమట్టూ దాంభజన చేసినా మనం దగ్గలేగు

ల : ఇంకా నయం హాలీవుడ్ నటి వచ్చిందన్నారు కాదు.

క : అసలు వచ్చిందేవారేమో, నువ్వు నాకు రాసిపెట్టుండకపోతే.

ల : అవును పాపం! వెనకటికి ఓజంగమయ్యగూడ యిలానే అనేవాడట.

క : ఐతే యింతకీ మనకి కాఫీ కషాయమైనా దొరుకుతుందా - ఒహారన్నట్టు.

ల : అవును యెలా దొరుకుతుందండీ - ఇటు చూస్తే దమ్మిడీరాబడి లేదు...

క : ఛట్! నెలకో పది రూపాయలు తెస్తున్నాను చాలవటే?

ల : ఐతే ఈనెల పైసా ఏది?

క : ఆపత్రిక పంపించలేదు నే నే ం చేసేది?

ల : అవును మీలాంటి చింకి డోలికి, మొండిచెయ్యి మద్దెలగాడట!

క : హాయ్ హాయ్! ఎంత పసందైన ఉపమానం!

ల : ఉపమానం ఏడిసినట్టేవుంది.

క : దాన్నలా ఏడవనియ్. అసలు ఈ కొత్తపత్రిక సంపాదకుడు ఓగుడ్డల డాక్టరు.

ల : గుడ్డల డాక్టరేమిటి?

క : అదో డిగ్రీలే *Ph. D* లాగున. *Gh. D* అని- మనలాంటివారు ఇన్ ఆబ్సెంటియా కాన్ఫర్ చేస్తూవుంటారు. అతను స్వంతంగా గుడ్డలు నేస్తూంటాడు. ఐ బెస్ట్



మల్లయుద్ధం

—ఫొటో: లక్ష్మణ్, వరంగల్.

లైవ్ ఆఫ్ ఇట్స్ కైండ్! వాటి ప్రచారం కోసం ఓ సారస్వత మాసపత్రిక స్థాపించాడు

ల · అయితే యిహనేం - మన డబ్బుకి బదులు రెండు వెంకటగిరి చీరలు పంపించమనండి

క · చచ్చాం పో! అప్పుడే సోమలింగం పేరుదగ్గరకే పోయావూ?

[తెరలోనించి ఒకంఠం : కనకారావు గారూ]

ల : ఉండండి ఎవరో పిలుస్తున్నారు... ఎవరు? [పక్కకి వెళుతుంది]

కం : పోస్ట్ మేన

ల . నిజం! నిజం! ఎంతొచ్చింది - ఎంతొచ్చింది?

కం : రావడం ఏమిటమ్మా?

ల : మని ఆర్డరు.

కం : మని ఆర్డరు రాలేదు. ఏదో ఉత్తరం.

ల : మనిఆర్డరు రాలేదు? ఉత్తరమా? పోని అదైనా చూడనియ్

కం : [ఇచ్చి వెళ్ళిపోతాడు.]

క : ఎక్కణ్ణుంచేవ్?

ల : ఏదో శుభలేఖ లాగుందండి. కరువులో అధికమాసమన్నట్టు - తిండానికే లేకేడుస్తుంటె వీళ్ళ పెళ్ళి యిప్పుడే వొచ్చిపడింది.

క : అదేవిటే! శుభమా అంటూ ఎవడో పెళ్ళాడుకొంటూంటే - నీ శాపాలు? ఏదీ చూడనియ్.

ల : ఇదేవరిదో ఇంగీషు పెళ్ళి లాగుందండి - శుభలేఖ ఎంగిలిపీసులో అచ్చేశారు!

క : చూడనియ్ [తీసుకొని చదువుతూ] ఛీ ఛా టా టా ఛే వ్వి... టు ... ఛి సా మిట్.

ల : ఏమిటండీ ఆఫైనాభాష - కొంపదీసి ఛైనా పెళ్ళికాదు కదా.

క : ఉంటావా? కూడ బలుక్కుంటూ చదవనియ్!

ల : అంత కూడబలుక్కునే ఖర్మమేం, లక్షణంగా తెలుగు భాషుండగా—

క : అది ఫురానా భాషేవ్... ఆఁ విను. చీ సౌ తాతాదేవిని చి. సౌమిత్రేశ్వర్రావు బి ఏ కిచ్చి ఫలానా నాడు, ఫలానా ఊళ్ళో, ఫలానా టైంకి పెళ్ళిచేస్తున్నారు గాబట్టి మీ పెళ్ళాం బిడ్డలతో ఈ పెళ్ళిని విట్నెస్ చెయ్యండీ అని.



## పక్షికోటిలో మానవలక్షణం

—ఫోటో: శిష్టా బ్రహ్మానందం, గురివిందగుంట అగ్రహారం.

ల. హమ్మయ్యో - రేపను. తెచ్చుకో మన్లేదు బ్రతికాం - అయితే వెడదామంటారా - వారం రోజులు మన యింటి కర్చయినా తగ్గుతుంది

క ఏం బ్రెయిన్! వారం దినాలు కర్చుతగ్గిందని చూశావుగాని టిక్కెటు ఖర్చు, బట్టలఖర్చు, చదివింపుల ఖర్చు ఇవ్వన్నీ నీ తాతా తెచ్చిస్తాడు?

ల' అవును అదీ నిజమే అయినా మనం ఈ పెళ్ళికి ఎలాగైనా వెళ్ళాలి పెళ్ళిళ్ళు అనేవి చూసి చాలకాలమయింది పదేళ్ళ నాడు మన పెళ్ళి తప్ప మరో పెళ్ళంటూ చూసెరగను.

క : రైటో! మళ్ళా యిద్దరం సరదాగా పెళ్ళాడేసుకొందాం.

ల : చాలించండి [మారాం చేసున్నట్టు] ఈ ఒక్క కోరికా తీర్చరూ? మనం ఎలాగైనా ఈ పెళ్ళికి వెళ్ళాలి సౌమిత్రీశ్వరావూ మీదగ్గర బంధువాయె, తాతాదేవీ మాదగ్గరి చుట్టరికం.

క : మంచిదే. మరి డబ్బూ పత్రికనించి రానియ్.

ల : అగుడ్దల డాక్టరు యిచ్చేదుస్తాడు మనం వెళ్ళేదుస్తాం - ముందు ఎలానో అప్పోసప్పో చేసి...

క : అబ్బబ్బ పట్టావంటే ఒకటే పట్టు- చూద్దాంలే.

ల : చూద్దాం లే అంటె కాదు. ఇప్పుడే వెళ్ళాలి

క : నువ్వొక్కడి రాక్షసివే సరె... నాకాళ్ళకి జోడు ముక్క లేదు; నీవంటికింత బెనారస్ చీరముక్క లేదు; నా ముఖానికింత సిల్కు చొక్కా లేదు ఈ అవతారాలతో పెళ్ళింటికి వెడితే పేడనీళ్లు వేసి కొట్టరూ?

ల : ఎందుకొక్కడతారేం? మన మేమన్నా పిలవని పేరంటానికి బయలుదేరుతున్నామా?

క. లేదులేగాని - ఇవ్వన్నీ ఎరువు తెచ్చేవరకైనా నన్ను నిలబడనిస్తారా?

ల : పోనీ. ఆఎరువన్నా సకాలంలో చెయ్యకపోతే, సమయానకి లేని బాకా...

[తెరలోంచి ఓ మగగొంతుక : "ఒరే! కనకారావ్ వున్నావా యింట్లో?"]

క. ఉన్నానున్నాను. కనకారావని కేకేస్తే పోస్ట్‌మాన్ వచ్చాడనుకొన్నాను... మీరా, రాండి రాండి

[ఇద్దరు యువకులు ఎడం పక్కనించి ప్రవేశం...లక్ష్మీదేవి నిష్క్రమణ]

ఒకడు : ఖులాసాగా వున్నావురా?

క : ఏదో - ఆ. దేవుడనే వాడుంటే, వాడి దయవల్ల బాగున్నాననే చెప్పాలి. ఏమిటికధ యిలా వూడిపడ్డారు?

రెండోవాడు · బజారుకి. వెడుతూ నీ గొంతుక వినిపిస్తే చూసిపోదామని. .

ఒక. కాదురా, పలకరించి పోదామని...

క : మంచిదే, నీ సంసారం ఎలాసాగుతుందిరా?

ఒ ఘనో! మన భార్యాదేవి వుంది చూశావు - బైదిబై ఆమనలో నేనొక్కణ్ణే రోయ్ - అః ఆవిడవుంది చూశావూ నిజంగా అన్నపూర్ణే అంటె నమ్మ!

రెం : మనం నమ్మం. ఎందుకంటె! మొన్న మనం వీడింటికెడితే కాఫీ ముక్కయినా యివ్వలేదు ఆమహాతల్లి!

#  కష్టం ఖలు పరాశ్రయః 

ఒ : ఏడిశావ్ ! అప్పుడది యింట్లోకి రాకూడదు——

రెం : మరి అన్నపూర్ణత్వం యెక్కడుం దోయ్ ఆవిడలో ?

ఒ : ఎంత కృతఘ్నుడవురా ! రోజూ పీకవరకూ త్రి కాఫీలు తాగి, ఒక్కరోజు యివ్వకపోత్తే యెంతనింద వేసావురా !

రెం : అవును - తప్పనేది పిసరంత చేసినా తప్పే ! చూడు మాలక్ష్మి వదిన నోటినించి ఎప్పుడైనా 'లేదు' అనేమాట వచ్చిందేమో ?

ఒ : మాలక్ష్మి వదిన గొప్ప నువ్వే పొగడుకోవాలి.

రెం : ఏడిశావ్...

ఒ : చూద్దాం ఐతే యిప్పుడు.

క : ఇదట్రా మీ స్టంటు ? లక్ష్మి వదినతో పోటీపడి యిప్పుడు కాఫీకుండ పొయ్యెక్కించడానికా ? ఆ అన్నపూర్ణ బిరుదులు మాకవసరం లేదుగాని, కాఫీ మాత్రం యిచ్చుకోలేం.

ఒ : ఒదిలిపోయిందా ?

రెం . ఇది వీడి తప్పు, మావదినది కాదు.

క : ఒరే ఇక దయచేసి నోర్లు మూసుకోండిరా ఇంతవరకు పాలు, పంచదార, కాఫీపొడుం లేక మన కడుపుకి కాఫీ అందలేదు. ఇక మీరొచ్చి పందాలువేసుకొంటే అదెక్కణ్ణుంచి తెస్తుంది ?

రెం : [నిట్టూర్పు] ఈవాళ ఎవడి మొహం చూశామోగానీ, ప్రొద్దుటనించి యింత వరకు ఏ వెధవని నోరువిడిచి అడిగినా నోరు తడపడు.

ఒ : తడిసే యోగంగూడ మనకి లేదురా బ్రదర్ ; ఇంతకీ మనం ఎంతకాల మిలా ఒకళ్ళమీద పడి తింటామురా ? ఉద్యోగమంటూ ఏదో ఒకటి వస్తే——

రెం : వస్తేగిస్తే అంటూ వెధవ ప్లానులు మధ్యపెట్టకు. వచ్చిందనుకో — వస్తే మనం ఏం చెయ్యగలం ?

ఒ : ఓస్ ! ఉద్యోగాసయి ఆ మాత్రం చేతకాదురా ?

రెం : చేతొస్తే ఏదీ, ఇండియా కిప్పుడు గవర్నర్-జనరల్ ఎవరు చెప్పు ?

క : అబ్బబ్బబ్బ ! ఎందుకురా పొద్దస్తే ఈ లేనిపోని సంతగొడవ. నా మానాన నన్ను విడిచిపెట్టిపోదురూ ?

రెం : అంత చిరాకెందుకురా - నీ ఏకాంతానికి భంగం కలిగిస్తే ఓ కప్పు కాఫీ పడేస్తే పోదూ ?

క : చచ్చినా కాఫీ దొరకదు.

ఒ : నువ్విచ్చినా మనం తాగం!... కా ఒక చిన్న కోరిక.

క : ఏమిటది త్వరగా ఏడు.

ఒ ఈమధ్య కొత్తగా - అంటే లేటెస్ట్ గేయమ్స్ రాస్తే ఓటి వినిపిస్తూ.

క : నా లేటెస్ట్ గేయం 'గుడ్డల పత్రిక' లో ఈనెల్లోవుంది చూసుకోండి పోయి

ఒ · బాబ్బాబు, అదీ నీనోటినించే వినాలని వుంది.

రెం : ఎవరిమీద వ్రాశావ్ ?

క : నాపెళ్ళాంమీద [విసుగ్గా]

ఒ : బాబ్బాబు అదే వినిపిద్దూ పోతాం.

క : ఒరే మీరెక్కడ సైతాన్లురా. సరే వినండి. [గొంతుక సర్దుకొని రాగం తీస్తాడు. రాగం రాదు.] మామూలుగా చదివేస్తాను రాగమెందుకులే.

రెం : అసలు రాదని ఏడవకు...ఊఁ ఎలాగోలా పాడేద్దూ

క · [గొంతుకు సర్దుకొని] ఇది నా పెళ్ళం !

రెం : ఏదీ ?

క : ఛట్ నోర్మూసుకొని విను !

ఇది నా పెళ్ళం !
అంటే మెడకొక కళ్ళెం !
ఇంట్లో ఒక పళ్ళెం——
కాని జీవితానికొక గొళ్ళెం !

ఒ : భలే ! భలే ! నువ్వుగాని సినీఫీల్డుకి పోయున్నట్టయితే ఎవరో అన్నట్టు అంగుళం పద్యానికి అయిదొందలు గడించేటంతేవాడివి.

క : ఆరోజుగూడ దగ్గరే వుందిలే. ఈ వున్నవాళ్ళంతా మనకంటె గొప్పవాళ్ళేమిటి ?

ఒ : కాదు కాదు - నువ్వు తప్పక ట్రై చెయ్యి.

రెం : అప్పుడు నేను నాట్యాచార్యుణ్ణి అవొచ్చు

క : సరె ఈగాలిమేడలెందుకు గాని, నాచేత పద్యం పాడించారు. మరి దానికి ప్రతిఫలం ?

రెం : ఏం కావాలో కోరుకో వత్సా.

క . ఇవ్వగలరా - మాట తప్పగూడదు.

ఇద్దరు : ఓ !

క : అయితే ఒరే నువ్వు మా అన్నపూర్ణ బెనారస్ సిల్కుచీర, ఒరే నువ్వు- మొన్న కొన్న కాబులీ చెప్పులు, సిల్కు చొక్కా

రెం : చచ్చాం ! నేను చెప్పలే కొన్నట్టు నీకెలా తెలిసిందిరా - మీలాంటి వాళ్లు ఎరువడుగుతారని దేవుడింట్లో భద్రంగా దాచుకొంటేను.

క : ఎలాగో తెలిసిందిగాని, యిస్తానంటావా లేదా ?

ఒ : ఖాతేం యిచ్చేడుస్తాంరా కనకారావ్ !

రెం : నీదెంతో యిచ్చిపడిపోయినట్టు వాడు అడిగిన బెనారస్ చీర తీసుకరా నీ పెళ్ళం నడుం విరక్కొట్టకపోతే ఒట్టు.

ఒ : ఏడిశావ్. మన మాటంటే దానికి హడల్ !

రెం : కాయ్ !

ఒ : కోతో నిజమో యుద్ధరం వెడదాం

ఖంటికి చెప్పులు నువ్వు తెస్తావో, చీర నేను తెస్తానో

రెం చూద్దాం

ఒ ఏమిటి మానేది – పందెం కలుపు.

రెం ఆఁ కలుపు ఎంత ?

ఒ నువ్వెంత వెయ్యగలవేం మహా – నీ జేబులో సగం కాల్చిపారేసిన బీడీముక్కలు తప్పించి

రెం వీడి జేబులో ఎంతో సిజర్స్ వుంచేడిసినట్టు

క ఒరే మీపందాలు మాటకేంగాని – యిద్దరూ ఎరువు యివ్వగలరు కాని ఎవరు ముందు తీసుకరాగలరని

రెం నేను ముందు తెస్తాను.

ఒ మొన్న రన్నింగ్ రేస్‌లో నాది ఫస్ట్ వచ్చినట్టు అబ్బాయి మరచిపోయి నట్టున్నాడు

క ఈమధ్య వాడు బాగా ఇంప్రూవ్ చేశాడు

ఒ ఏడిశాడు, ఎంత చేసినా మనకింద బలాదూర్.

రెం ఒరే బలాదూర్ గిలాదూర్ అన్నావంటె జాగ్రత్త

ఒ ఏం చేస్తావురా ?

రెం నువ్వేం చేస్తావురా ?

క అబ్బబ్బ! కొట్లాటేగాని కార్యాని కుపక్రమిస్తారా లేదా ? ఒన్, టూ, రెడీ, త్రీ అనే లోపున మీరు పరుగెత్తాలి

రెం ఓ! ఒరే యిక నోరుమూసుకొని పరిగెత్తడానికి తయారవు

[ఒకట, రెండు గాళ్లు పరుగెత్తడానికి నిలబడతారు – 'క' కొరం ఒన్ టు, రెడీ త్రీ అంటాడు ఇద్దరూ ఎడంచేతివైపు పరుగుతీస్తారు ఒక్క నిమిషం అయిన తర్వాత రెండుగాడు వెనక్కు తిరిగొస్తాడు]

రెం. [రొప్పుతూ] అరె! భాయి! పంతనికి పరుగెత్తానుగాని వాడితో నేను పరుగెత్తలేనురా ఒక వేళ ఆలస్యంగా వచ్చినా నేనే ముందొచ్చానని చెప్పెయ్యి [మళ్ళీ పరుగెత్తిపోతాడు] ['ల' కొరం కుడి పక్కనించి ప్రవేశం]

ల వెళ్ళిపోయారా ? మొత్తానికి భలే వాళ్ళండి కాఫీకోసం ఎంత పానుమీద వచ్చారు!

క ఏడిశారు తాతకి దగ్గులు నేర్ప గలరూ ? ఉల్టా తిప్పి వాళ్ళమీదికి విసిరా నుగా అసలింతకీ వాళ్ళనిలా తయారుచేసి నందుకు ప్రభుత్వాన్ని అనాలి

ల బాగుంది విళ్ళు కాసేలు ముష్టెత్తు కొంటూంటె మధ్య ప్రభుత్వమేం చేసింది?

క ప్రభుత్వం ఉద్యోగాలు చూపించ కేగా వీళ్ళిట్లా తయారయ్యారు. ఆసుందరం గాడికి మెడకోడ్లోలు తగిలించారు, ఏడాది. ఈసంవత్సరానికల్లా వాడి భార్యా రత్నం జతపిల్లల్ని అందించి ఊరుకొంది వాళ్ళకి పాలుపెట్టే బాధ్యత వాడిదికాదు వాడి తండ్రిది – ఇలా తయారయ్యారు మన తెలుగు యువకులు.

ల. ఆఁ ఏదో సామెత చెప్పినట్టు మాటాడుతున్నారు కూతురు పిల్లని కనక పోతే అత్త అల్లుడుమీద పడేడిచిందట. వీళ్ళల్లో యింత చేవ లేదు – ప్రభుత్వం దగ్గరికి పోయారు. అది సరే గాని మన పెళ్ళి మాట

క చేసుకొందాం లే.

ల అబ్బ అది కాదండి పెళ్ళి ప్రయాణం ?

క, నీ ఎదరగానే అడిగానా వాళ్ళని! ఈపాటికి చీరలు సిల్కు చొక్కాలు తెస్తూవుంటారు వాళ్ళు నువ్వుత్వరగా పెట్టెలో బటలు సర్దుకో.

ల. డబ్బు మాట ?

క అదే వస్తుంది ఆఁ... చాకలాడు తెచ్చిన బటలు రెండూ భుజాలమీద చినిగి పోయాయి అవి కొత్తపోగులు పోసేద్దూ... చూడు ఇంటితాళాలు ఎవరికీ ఇవ్వొద్దు మనమే తీసుక వెడదాం

ల సరె మీరు త్వరగా లేవండి ఈ బండికే వెళ్ళిపోదాం

క నువ్వు ముందు తయారవుదూ!

['ల' నిష్క్రమణ]

క [కుర్చీలో కూచొంటూ] ఏమిటి సంసారం! లక్షణంగా ఉద్యోగం చేసు కొంటె నెలకింత సొమ్ము చేతిలో పడేది. ఆదర్శాలంటూ, ఆశయాలంటూ ఈపత్రికా రచనలోకి దిగి అకుకి అందక పోకకి పొందక మధ్య త్రిశంకు 'నరకం' లో పడేడు స్తున్నాం తలకి ఇంత నూనె వుండదు; కడుపుకింత కమ్మని బువ్వదొరకదు – పోనీ కథరాస్తే డబ్బేమన్నా వస్తుందంటె ఈ గుడ్డల డాక్టర్లు—. వచ్చేది ఎండాకాలం; చెప్పుల్లేవు, బంధువుకి పెళ్ళి అవుతుందంటే వెళ్ళేటందుకు చేతిలో తడిలేదు ఏమిటో బ్రతుకు ఇంకా వీళ్ళు రాలేం...

[ఒకగుగాడు కుడిపక్కనించి తలొంచు కొని ప్రవేశం]

క. [ఆశగా దిగ్గున లేచి] ఏరా తెచ్చావా ? బెనారస్ చీర తెస్తానన్నావు కదూ ?

ఒ [తలూపుతాడు]

క. ఏం ?

ఒ నాకు తెలీక ప్రామిస్ చేసేశానురా. కాని తాతాదేవి మా ఆవిడ ఆడపడుచు కూతురు అత్తగారి చిన్నమ్మాయట. మమ్మల్ని గూడ రమ్మని శుభలేఖరాశారు.

క ఛచ్ఛాం పోనీ ఏదో ఒక చీర తీసుక రావలసింది

ఒ. నా సంసారం గొడవనీకు తెలియ దట్రా! ఆ ఒక్క చీరతోనే ఆవిడ కాపరం వెలిగిస్తోంది ఉద్యోగమన్నా వుంటె నాలుగు కోకలు కొనేవాడిని

క : పోనీ శంకరం గాడేడి ?

ఒ : వాడు మధ్యదార్లో కనిపించాడు.

క : ఏమన్నాడు ?

ఒ. ఎలాగూ నేను చెప్పేది నెగటివ్ అన్సరేగాబట్టి తన గొడవగూడ నీతో చెప్పెయ్యమన్నాడు

క. లేవన్నాడా లేక పెళ్ళికొడుకు, వాడి పెళ్ళాం ఆడపడుచు కూతురు అత్తగారి పెద్దబ్బాయి అన్నాడా ?

ఒ. కాదు – వాడి జోళ్ళని ఎలకలు ఎత్తుకపోయాయట!

క : శహబాష్! ఆనెగిటెవ్, నీనెగిటవ్ నీనోటినించే చెప్పెయ్యమన్నాడన్న మాట!

ఒ క్షమించాలిరా – నమ్మించి ద్రోహం చేశాను

క నో నో. నిరుద్యోగుల శపథాలు ఏ లెఖ్ఖలోవి కావురా

ల [వస్తూ] అబ్బ! యింకా ఆమాట లేమిటండీ – త్వరగా ప్రయాణమవండి.

క : ప్రయాణం తప్పిపోయింది.

ల : ఏం ?

క : బెనారస్ చీరాలేదు; కాబూలీ చెప్పులూ లేవు – నామాట విను లక్ష్మీ ఎవళ్ళో పెళ్ళికంటె ఈసాయంకాలం మనిద్దరం పెళ్ళి చేసుకొందాం. అదైనా కొత్త తృప్తి నిస్తుంది

ల : నాకు మొదటనించీ తెలుసు – దరిద్రుడు కాలుకదిపితే వడగళ్ళవాన అని. అయినా యింతకీ ఒకళ్ళ నోటికీ చేతికీ చూస్తూ బ్రతకడమేమిటి ?

క : నిజమే లక్ష్మీ! పరులనాశ్రయించడం మహాకష్టం ఈవాళనించి కష్టపడాలి ఈప్రయాణం ప్రోగ్రాం వాయిదా వేయవూ ?

(తెర)

★

# పాఠశాల

"విధి లిఖితం" అనే శీర్షికతో, నేను ఒక కథ రాశాను మాది పల్లెటూరు. నేను అట్టే చదవలేదు అందుకని తప్పులుంటా యేమోనని భయం. మా ఊరికంతా ఒకే ఒక కవివున్నాడు. అతని దగ్గరికి తీసికెళ్లి చూపించాను నా కథని. మొదటి రెండు పేజీలు, చివరి పేజీ చదివి, ఆ కథని తిరిగి నాకిచ్చేసి, చేతులు దులుపుకున్నాడు ఒక పొడుంపట్టు పీల్చాడు.

"ఎలా వుందండీ? దీన్ని పత్రికకు పంపించాలని నా ఉద్దేశం" అని చేతులు నలిపేను, వినయంగా.

'ఇదివరకేమైనా రాశావా?' అన్నాడాయన.

"రెండు రాశాను"

"పత్రికకేమైనా పంపించావా?" అన్నాడాయన

"లేదు"

"మంచిపని చేశావు" అన్నాడాయన. సిగ్గుపడ్డాను

"మానెయ్యమంటారా పత్రికకు పంపటం?"

"మానెయ్యబోకు. రాస్తూనే వుండు. కాని, కథలురాసి, నీలో నువ్వు, రెండు మూడుసార్లు చదువుకొని, తరువాత చించేస్తూ వుండు ఎందుకంటావా? అనుభవం రావాలి కనీసం, ఒక ఇరవైకథలన్నా రాసి, చించేసెయ్యి, ఇరవై ఒకటో కథని పత్రికకు పంపించు" అన్నాడు. తిరిగి వచ్చేశాను. కాని, చించివెయ్యలేకపోయాను, ఆయన సలహామేరకు మరొకాయనకు చూపించాను ఆయన కవిగాదు. కమ్యూనిస్టు అని పుకారు మాఊరందరికన్నా ఎక్కువ చదివాడు ఆయనకు చత్వారం. నన్నే చదవమన్నాడు. చదవటం ప్రారంభించాను

* * *

"మధ్యాహ్నం సూర్యుడు నడినెత్తిమీదున్నాడు ఎండ తీక్షణంగా కాస్తోంది భూమి తీవ్రంగా కాలిపోతోంది. తీక్షణంగా కాస్తున్న ఎండలో, తీవ్రంగా కాలుతున్న భూమిమీద నేను ఎక్కడికో, ఎందుకో పోతున్నాను నాకాలికి చెప్పులున్నయ్

ఒక స్త్రీ రోడ్డుమీంచి నడిచి వస్తోంది మందంగానూ, వయ్యారంగానూ నడవాలని ఆమె ఉద్దేశం. చెప్పులులేవు. ఎండ ఊరుకోవటంలేదు. సహించలేకపోయింది. గజగమనం మానేసి, సింహగమనంతో గుడ్డల కొట్లో జొరబడింది, వస్త్రం అవసరవ్యాజంతో

ఒక కుర్రవాడు రోడ్డుమీద నడుస్తూ నడుస్తూ, బంతిలా క్రిందపడిపోయి, గిలగిల తన్నుకుంటున్నాడు జనం మూగేరు. కుర్రవాడికి పదిసంవత్సరాల వయసుంటుంది. కొద్దిగా నలుపు ఒంటిమీద దుమ్ము కొట్టుకుంటున్న బనీను, నిక్కరు తొడుక్కొని వున్నాడు దారేపోయే జనం ఇంకా మూగేరు చుట్టూ కమ్ముకున్నారు అంతా చర్చించి, చివరికి 'మూర్ఛ' అని నిర్ణయించారు. చర్చించటానికి అయిదు నిమిషాలు పట్టింది. కుర్రవాడు తన్నుకోవటం ఉధృతం అయింది ఉన్నట్టుండి, ఒక పెద్దమనిషిదృష్టి, ఆ కుర్రాడి గుండెలమీద, తన్నుకుంటూంటే కదులుతోన్న రాగిబిళ్ల

## బసవారెడ్డి

మీద పడింది "ఇది తప్పకుండా మూర్ఛే" అని ధృవపరిచాడు. అతనికి చదువు రాదు. దానిమీది అక్షరాలు, మరొకాయన వంగి చదివాడు ఇలా:

"ఈ కుర్రవాడికి తల్లిదండ్రులు లేరు బీదవాడు. 5 సంవత్సరములుగా మూర్ఛ వ్యాధితో బాధపడుచున్నాడు. ఇతనికి మూర్ఛ వచ్చినప్పుడు, తాళం చేతులు గుప్పిట్లో పెట్ట, 2 బిందెలు నీళ్ళు పోయవలెను అట్టివారికి భగవంతుడు మేలు చేయుగాక" అని.

విన్నారు అంతా కొందరు వెళ్ళిపోయారు - భగవంతుడిమీదా, అతనుచేసే మేలుమీద గ్యారంటీలేనివాళ్లు. సమీపంలో శేషావతారంగారి రెండంతస్తులభవంతి వుంది. అందులోంచిబయటికొచ్చాడాయన,ఆయన భగవద్భక్తుడు. ఖరీదులేకుండా పుణ్యంపోగుచేసుకునే అవకాశం వుంటే, శేషావతారం వదిలిపెట్టడు. 2 బిందెలనీళ్లూ స్వయంగా - ఉదరానికి కష్టంగా వున్నా, తెచ్చిపోశాడు రొప్పుతూ నిలుచున్నాడు కుర్రాడు కొట్టుకోవటం కొంచెం తగ్గించాడు. కాసేపటికి లేచాడు. ఒణుకుతున్నాడు. అందరికీ దణ్ణాలుపెడుతూ, "అయ్యా ధర్మం" అని, చుట్టూ వున్న జనందగ్గరకు, ఒక్కొక్కరిదగ్గరకు వచ్చి చెయ్యి చాపుతున్నాడు, తలొక కానీ వేశారు ఒక దాత, తన ఇంటగుర్తులుచెప్పి, అక్కడికి వస్తే, ఒక చొక్కా, ఒక లాగు ఇస్తానని వాగ్దానం చేశాడు. ఈ సమయం చూచి శేషావతారం మెల్లగా భవంతిలోకి పోయి తలుపేసుకున్నాడు ఆ కుర్రాడు నా దగ్గరకే వచ్చాడు. ఏదో జ్ఞాపకం వచ్చింది, అతడి మొహంచూస్తే కానీ వేశాను అజ్ఞాపకం అటూఇటూ కొట్టుకొని, మెల్లిగా పైకిలేచి, మేధమీద ప్రతిబింబించింది:—

ఎక్కడికో రైలులో ప్రయాణం చేస్తున్నా జనం క్రిక్కిరిసి వున్నారు ఆడవాళ్లు, మగాళ్లు కలిసిన జనం నాముందొక స్త్రీ వుంది ఆమె శరీరం, నా శరీరం ఒరుసుకొంటున్నాయ్ విశాలమైన బజారులో నడుస్తున్నప్పుడు, ఎదురుపడిన పురుషుడినల్లా, సర్పాన్నిచూసి తప్పుకున్నట్టు తప్పుకుంటూ, ఎడంగా నడిచిపోయే ఆడవాళ్లు—ఇంత తొక్కిడిలో క్రొవ్వెద సువాసనలతో పరాయి పురుషులకి మత్తుగొలుపుతూ, ఎలా నించోకలుగుతున్నారో పాపం! ఇంతలో జనంలో, కలకలం బయలుదేరింది ఒత్తిడి ఎక్కువగా సాగింది ఉన్నట్టుండి నా ముందున్న స్త్రీ, "అయ్యో గొలుసేది, నా మెళ్లోది?" అని కేకవేసి,ఏడుపు ఆరంభించింది ఒకకుర్రాడు జనం కాళ్లమధ్యగా తప్పించుకుని, అవతలి పెట్టెలోకి పోబోతున్నాడు అనుమానించి, కుర్రవాడు కాబట్టి, ధైర్యంచేసె పట్టుకున్నా డొకాయన వెతికితే జేబులో గొలుసుంది చితకబాదారు వాణ్ణి పోలీసు కప్పగించారు, ప్రాణావశేషంగా—

ఆ కుర్రవాడే వీడు అని నా అనుమానం, ఒకవిధంగా నమ్మకంకూడా అనుకోవచ్చు జనం వెళ్ళిపొయ్యారు కుర్రవాడు లెక్కచూసుకుంటున్నాడు డబ్బు

"అరేయ్! ఎంతొచ్చిందిరా ఆదాయం?" అడిగేను

నావైపుచూచి, "పావలా" అన్నాడు. ఇంకా ఎక్కువే వుంటుంది

"ఏం చేస్తావురా దాంతో?"

"మా అయ్యా, అమ్మ ముసిలోళ్ళు

అయిదుగురు నాకన్నా చిన్నోళ్లు వున్నా రండి. అందరం దీనితో బతకాలి" అన్నాడు

"మాయింటికిరా. భోజనం పెట్టించుతాను" అన్నాను "సరే" నని తలఊపి నావెనకబడి ఒచ్చాడు. అన్నం పెట్టించాను సుష్టుగా తిన్నాడు త్రేవ్ మని త్రేపేడు. "జై పాతాళభైరవి గిడిగిడి" అన్నాడు. అదేదో వాడి పరిభాష కుర్రాడు ఉత్సాహంగా వున్నాడు. లేచి వెళ్లబోయాడు

"ఆగవోయ్! వెసుగువుగాని కాస్సేపు కూచో" మన్నాను కూచున్నాడు బీడీ ముట్టించాడు ఉచితంగా భోజనం పెట్టించినదాత ఎదుట వీడింత నిర్భయంగా బీడీ కాలవటం మాచి ఆశ్చర్యపోయాను వాడి వైఖరిమాస్తే, ఇండియన్ యూనియన్ ప్రెసిడెంటు ఎదటైనాసరే - నిర్భయంగా బీడీ కాలుస్తా డనిపించింది అసలు భయం, నిర్భయం ప్రసక్తిలేదు సినిమాహాలు నేలలో కూచుని బీడీ కాల్చినట్టుగానే, నెహ్రూ ఎదట కాలుస్తాడు; నాయెదట కాలుస్తాడు, మరొకరి ఎదట ఎక్కడైనాసరే

"ఏరా? నిజం చెప్పు నీకు నిజంగా మూర్ఛనా ఇది? నేను డాక్టర్ని కాబట్టి నాకంతా తెలుసులే ఊరికే, మనలోమాట దొంగమూర్ఛకదూ నీది?" అని అడిగేను

కుర్రాడు, కడుపునిండా తిన్నమీద, బీడీ కాల్చిన నిషాలో వున్నాడు, వాడికి ప్రపంచం, పగిలిపోయిన గాజు పెంకులా కనిపిస్తున్నది పెద్దగా నవ్వేశాడు "కను క్కున్నావే తస్సాదియ్యా" అన్నాడు.

"నీకు అమ్మా, అబ్బా వున్నారట్రా! నిజం చెప్పు నే నెవరితో చెప్పనులే" అనడిగేను

మళ్ళీ నవ్వేడు "అంతా ఒట్టిదే అట్టా చెప్పకపోతే, కాస్లురావు" అన్నాడు

"నీకు మీ నాయనా - అమ్మ లేరా?"

"ఊహూఁ"

"అయిదుగురు పిల్లలు కూడా అబద్ధమేనా?"

"ఆఁ" అన్నాడు, చిరునవ్వునవ్వి, నన్ను నమ్మించిన తన తెలివి తేటలకు గర్విస్తున్నట్టు.

"మీ నాయనా, అమ్మ చనిపోయి ఎన్నాళ్లయింది?"

"ఏమోఁ? నాకేం తెలుసు?" అన్నాడు

మెల్లగా నా అనుమానంకూడా బయట్పెటాను "ఒరే అబ్బాయ్ బెజవాడ - బందరు రైల్లో నువ్వొకసారి నాకు కనపడలా?" అడిగేను.

"ఇక్కడికి రాకముందు బెజవాడ స్టేషన్లోనే నా మకాం అప్పుడప్పుడూ తమాషాకి రైలెక్కుతుండేవాణ్ణి" ఏదో చెప్పబోతూ వున్నాడు వాడి మాటని సరికేసి నేను ప్రారంభించా:

"సంక్రాంతి పండగ రెండురోజు లుందనగా రాత్రి బండిలో.." కొద్దిగా బిక్క మొహం వేశాడు కుర్రాడు.

"భయంలేదులే. నిన్ను ఆవేళ బలే కొట్టారు పాపం!" "సరేగాని ఆ గొలుసెట్టా కత్తిరించా?" రహస్యంగా అడిగేను, భుజం తడుతూ

కొంచెం తటపటాయించి, చెప్పాడు "ఆ గొలుసు కత్తిరించింది నేను గాదు. ఎవురో, పొడుగ్గా, లాగూ, కోటూ తొడుక్కుని దానిపక్కన కుంచున్నాడు అడు చానా పొడుగ్గా వున్నాడు ఒరి బాబో! ఇంత పొడుగున్నాడేందిరా అని ఆడి మొహంకేసి సూత్తిన్నా మెల్లిగా జేబులోంచి కత్తిరితీసి గొలుసు కత్తిరించాడు నేను చూశాను 'ఏయ్!' అన్నా నాకల్లే చూసి, బిత్తరపోయి, నాసామిరంగా! అదే పనిగా దూసుకున్నాడు ఆ గొలుసు తెగి, మెళ్లోనుంచి జారి, దాని కుచ్చిళ్లకాడ చిక్కకుంది ఆ ముద్దింకా చూసుకోనే లేదు" అని పక్కన నవ్వాడు

"కూసేపు చూశా మెల్లగాతీసి, దాన్ని జేబులో ఏసుకున్నా, ఏసుకోగానే, అది మెడ చూసుకుని, కేక లేసింది నాకు బయమేసింది నేనెప్పుడూ దొంగతనం చెయ్యలా. అదే మొదలు' ముగించాడు

"ఆ పోలీసేం జేశాడు?"

"నాలుగుతన్ని, ఇక్కడకనపడ్డావంటే, పాణంతీస్తానని ఒదిలిపెట్టాడు"

"నిజంగా అదివరకు ఎప్పుడూ దొంగతనం చెయ్యలేదురా?"

'ఆహాఁ" అని బుంగమూతి పెట్టాడు మళ్ళీ ఏదో గుర్తు తెచ్చుకుని "దొంగతనం చెయ్యలేదుగాని, అప్పుడప్పుడూ, పళ్ళకొట్లల్లో అరటికాయలూ, అయ్యాకాజేసేఓణ్ణి అదైనా, కిట్టిగాడి సావాసం మూలంగానే" అన్నాడు.

"కిట్టిగాడెవరు?" అడిగేను

"ఆడొక పెద్ద జేబుదొంగ చిన్నప్పటి నుంచీ అదేపనంట ఆడికి బలే న్యాక్కగా పరుసు లాగత్తాడులే. ఆడే చెప్పేడు ఇంతమటుకూ ఆణ్ణెక్కడా పట్టుకోలేదంట. అయితేమటుకేం శానా మంచోడు. నాకు అప్పుడప్పుడు పావలా, అద్దరూపాయి - ఇట్టా ఇస్తుండేవాడు మరిచిపోయా ఒకసారి రూపాయిరూపాయ్ సాంతం ఇచ్చేశాడు."

"అలాగా?"

"ఊఁ" అని గర్వంగా అన్నాడు.

"తరవాత?"

"ఆ డెమ్మలే తిరుగుతుండేవాన్ని ఆడితో సినిమాలికెళ్లేవాణ్ని ఆడు బెజవాళ్లోవుంటే, అస్సలెక్కు నేవాణ్నే కాదు ఆడెమ్మటే, స్టేషన్లో కనపడ్డానంటే సరి - ఒక ఎర్రబుట్టోడుండేవాడు స్టేషన్లో - ఆడు... ఎర్రబుట్టోడంటే తెలుసా?" సందేహం ఒచ్చింది వాడికి "తెలుసులే" అన్నా.

"ఆ ఎర్రబుట్టోడు - ఎందుకులే, పోలీసోడనేఅంటా. ఆడు - కిట్టిగాన్ని, నన్ను చూసినప్పుడల్లా, లాటీతో ఊపి మీనపాడిస్తి, సెవ్వు మెలేసేవాడు. అప్పుడు బలే నెప్పెట్టేదిలే కిటిగాన్ని ఏమనేవాడుకాదు మళ్లీ"

"ఎందుకని?"

"ఏఁమో మరి?"

"ఆఁ! ఆడేఁ ఒకరోజున ఆడూ, నేను సినిమాకెల్లాం, 'ఆవారా'కి సినిమానించి ఒస్తావుంటేఅన్నాడుకిట్టిగాడు. చూశావా? రాజకపూర్ గాడు ఎట్టాంటి దొంగతనాలు చేశాడో? .. నువ్వుకూడా నేర్చుకోరా సన్నాసీ ఇట్టా ఎన్నాళ్లిట్టి అడుక్కుతింటావ్?" అన్నాడు

అమ్మో - అన్నా నేను కొడతారుగా మరి

ఇప్పుడుమాత్రం కొడతంలే? ఆ పోలీసాడు? - అన్నాడు కిట్టిగాడు

"ఇప్పుడైతే సిన్నసిన్న దెబ్బలైను - దొంగతనం చేస్తే, ఇంకా పెద్ద దెబ్బలు కొడతారు" అమ్మో! ఒద్దన్నా.

"సరే ఏడుప్ - అన్నాడు కిట్టగాడు ఆడి కోపమొచ్చింది కూసేపు ఆలోసించుకున్నా. చెయ్యాలనివుంది మళ్లీ దొంగతనాలు చేత్తే కిటిగాడిలాగా నేనూ డబ్బు కరుసు చేసుకోవచ్చు మళ్లీ బయ్యం కొడతారని అబ్బో బలేగా కొడతారులే.

# పాఠశాల

నువ్వెప్పుడన్నా చూశావా?" అడిగేడు నన్ను కుర్రాడు.

"నేను చూడలే"దన్నాను

"నేను చానాసార్లు చూశా. అన్నిటి కన్నా ఒకసారి బలే బయమేసింది బెజవాడ టేసన్‌లో, టిక్కెట్లమ్మేచోట పట్టుకున్నారాణ్ని మడిసి బాగానే వుండాడు మల్లా పట్టుకుని అణ్ని కిందపడేసి, జనమంతా కలిసి పొడుత్తుంటే, బలేగా కేక లేశాడు పాపం. మొహమంతా నెతురు పూసినట్టు ఎర్రగా అయిపోయింది. కాళ్ళ నిండా, చేతులునిండా, ఒళ్ళంతా పుళ్లు పడినయ్ ఆడికి పాపం! బలే జాలేసిందలే నాకు"

"కిష్టిగాడుకూడా చూశాడా?" అన్నా.

"ఆడూ వున్నాడు. అటా కొడతారని బయ్యంరా-" అని అన్నా కిష్టిగాడితో

"ఆడ్డొకే దద్దమ్మ-"అన్నాడు కిష్టిగాడు.

"అబ్బో! నువ్వ? - అన్నా నేను నాతో ఒకరోజు దొంగతనానికి రారా అన్నాన! చూపిత్తా నా మజా అన్నాడు కిష్టిగాడు ఒకరోజు ఆడితో తెనాలి బండెక్కాను ఆడి పక్కనే నుంచున్నా నేను రెండో టేసనులో ఆడు దిగి, నన్నూ దిగమన్నాడు ఒస్! ఇంతేగదా ఈడి పస అనుకున్నా. తీరాచూత్తే పర్సు చూపిచ్చాడు నాకు మరి ఎప్పుడు తీశాడో ఏందో? ఆరోజున బలే జల్సా చేశాంలే ఆరోజునే నేర్పాడు నాకు, పస్లు, అరిటి కాయలు దొంగతనం చెయ్యటం. రెండు రోజులు ఆడు దగ్గిరుండి చేశాడు తరువాత నేనే, అప్పుడప్పుడూ చేసుకుంటూ వుండే వాణ్ణి" కథ ముగించాడు కుర్రాడు వాడు అంత నిబ్బరంగా, అంత చక్కగా, ఈ కథ చెప్పటం - వాడి వయసుకి మించిన తెలివితేటలే. వీణ్ని చదివిస్తే, ఎంత వృద్ధిలోకి వచ్చేవాడో అనిపించింది. కుర్రాడు కాండ్రించి అరుగుమీద ఊసి, మళ్ళా ఒక బీడీ ముట్టించాడు చక్కగా పొగ పీలుస్తున్నాడు నిర్విచారంగా

"అక్కడ ఉశావేఁ? కాస్త తుడిచిరా." అన్నాను.

"తుడుస్తాలే" అన్నాడు నిర్లక్ష్యంగా.

వాడికి వినయం అంటే ఎలావుంటుందో తెలియదు. అది వాడికి ఎవరూ నేర్ప లేదేమో! వినయం విషయంలో గుమాస్తాలకి మంచి కాలం వుంటుంది వాళ్లు పుట్టు



తెలుగువారి తొలి ఉగాదికి ప్రభుత్వ కానుక

—ఫొటో: లక్ష్మణ్, వరంగల్.

గానే, తల్లి, చనుపాలతోపాటు, వినయాన్నికూడా త్రాగిస్తుందేమో! ఆఫీసరు బజారున కనిపిస్తేచాలు - పెద్దపులి ఎదురొస్తున్నట్టు భయపడి హోటల్లోనో, మరోచోటనో దాక్కునే గుమాస్తాలను చాలా మందిని చూశాను

ఈ కుర్రాడికి ఎవరైనా, నోరు పగలదీసి, బలవంతాన "వినయం" మింగించినా, అది వాడికి ఇమడదు వమనం చేసుకుంటాడు - ఇలా ఎందుకనో అనిపించింది. నాకు

"మీ అమ్మావాళ్లు చనిపోయి ఎంత కాలం అయిందిరా?" అని అడిగేను.

"ఏమో!"

"అసలు చూడనేలేదా వాళ్లని?"

"ఊఁహూఁ"

"చిన్నప్పటినించీ బెజవాడలో నే వున్నావా?"

"కల్ గెటుగా"

"నీకు గ్నాపకమేనా?"

"నాకు గాపకమే కిష్టిగాడు కలంటాడు మరి"

"తెన్ని?"

"చెబుతా" బీడీ గట్టిగా పీల్చి అవతల పారేశాడు. "ఒకరోజున - అంటే నే నప్పుడు చిన్నోణ్ణి. చాలాచిన్నోణ్ణి మూడో, నాలుగో ఏళ్లుంటయ్యనుకుంటా. పట్టాల మీద రైలుబండుండంట. నేను దానిపక్క నున్నా. అప్పుడు నాకు రయిలుబండేం చేసుద్దో, పట్టాలేంచేసుద్దో నాకుతెలవదు. రైలుకింద ఒక గిలక్కాయుంది. అప్పుడు దానిపేరుగూడా తెలవదు నాకు. దాని కోసం మెల్లిగా అడుగుతేసుకుంటూ ఎలేను గిలక్కాయి చేతికి దొరికింది నీడగావుంది, చల్లగా అక్కడే పడుకుని గిలక్కాయితో ఆడుకుంటున్నా. నామీదగా అది - అంటే రయిలుబండి - పరిగెత్తుకుంటూ పోయింది. నాకు బయమేసింది ఏడ్చాను. కాసేపటికి మోత తగ్గింది. నాచేతిలో ఏదో తినేదుంది" కాసేపటికి జ్ఞాపకం తెచ్చుకుని "ఆఁ.. బిస్కత్తు అనుకుంటూ అది తింటూ పడుకున్నా ఆడనుంచీ టేసనులో వున్నానేమో నని నేననుకున్నా ఒకనాడు ఈకథ కిటిగాడితో చెబితే - అచ్చే అదంతా కలరా- అన్నాడు నేనుకూడా కలే గామాలనుకున్నా ఇది కలా? నిజమా? అని, నాకిప్పుడికీ అనుమానమే నువ్వేవంటా దీన్ని" అడిగేడు కుర్రాడు

నాకేమీ తోచలేదు "బహుశా, కలేనేమో!" అన్నా ఆ కుర్రాణ్ణి చూస్తుంటే, నాకు వింతగా, గుర్రపు కొమ్ముల్లా, - విచిత్రంలో పడిపోయాను

"సరే ఎల్తున్నా, పొద్దోటాలింది యాడైనా ఇంకా రెండుసోట్ల మూరస పడితేనేగాని, రాత్రిరికి సినిమాకర్చు రాదు" అనివెళ్లిపోయాడు, నేను మేలుకోనకముందే

ఈ నిర్భాగ్యుడు ఎక్కడ పుట్టాడో తెలియదు తల్లిదండ్రు లెవరో తెలియదు చరిత్రహీనుడు సేషను దుమ్ములో, ప్లాటుఫారం గులకరాళ్ళలో, బొగ్గు పొగల్లో, భయంకరమైన ఇంజను కూతల్లో, దొంగ వేషాలు వేసుకున్న మనుషులమధ్య, మనిషి వేషాలు వేసుకున్న దొంగలమధ్య - పెరిగేడు, దొంగతనం నేర్చుకున్నాడు మోసం నేర్చుకున్నాడు. ప్రపంచాన్ని - అది, రచించిన రాజ్యాంగానికి, అనుకూలమైన విధంలోనే శిక్షించి, పొట్టపోసుకుంటున్నాడు.

కుర్రాడికి వయసుకు మించిన తెలివితేట లున్నాయ్. అయినా, అతను దొంగ అయ్యాడు. ఇలా ఎందుకు జరిగింది? ఇది 'విధిరాత' అయితే మాత్రం—ఇలాటి తప్పుడు 'రాతలు' రాసేవాణ్ణి—ఎక్కడుంటాడో తెలిస్తే, డొక్క చీరెయ్యాలనిపించింది"—

కథచదవటంముగించి, ఆయనవంక చూచాను వెంటనే ఇలా ప్రారంభించా డతను. "నువ్వు చివర, ముగింపులో దెబ్బతిన్నావు. దొంగల్ని, మోసకాళ్ళని సృష్టించేది సమాజం - లేదూ, "వ్యవస్థ" అను నువ్వు నిందించాల్సింది దాన్ని. అంతేగాని 'విధి'నిగాదు. ఇది మంచంలోపడి తీసుకుంటుంటే, దీనిమీదనా, నీ ఆగ్రహం?" ముగించాడు సలహా.

"అయితే చివరి పేరా, మార్చి రాయమంటారా?" వినయంగా అడిగేను. 'అవు' నన్నాడు

"దీన్ని ఏదో ఒక పత్రికకు పంపాలనుకుంటున్నా. మీరు చెప్పిన మార్పుచేసి పంపకుంటారా?"

పంపించమన్నాడు

"దీన్ని కవరులో పెట్టి, పోస్టులో తూకం వేయించి, సరిపడ బిళ్ళలంటించి పంపమన్నారా?" పంపమన్నాడు; ఒక మార్పు సూచించాడు"రిజిష్టరుపోస్టులో పంపు"అని.

"తిరుగు రశీదుకూడా అంటించమంటారా?" అంటించమన్నాడు. వెంటనే ఇంటికొచ్చి, ఒకసారి కాగితాలన్నీ తిరగేశా. నా అదృష్టంవల్ల, అతను మార్చమన్న చివరి పేరా, చివరి కాగితంమీద (వ్రాత పేజీల్లో) వుంది, అది చింపేసి, మరో కాగితం తీసుకుని, వ్రాయటం ప్రారంభించి, పూర్తిచేశా నిలా.—

"కుర్రాడికి వయసుకు మించిన తెలివితేట లున్నాయి అయితే ఏం లాభం? అతను దొంగ. మోసగాడు. అతను ఇలా ఎందుకు తయారయాడు? అతను దొంగ కావటానికీ, మోసగాడు కావటానికి కారకు లెవరు? ఎవర్ని నిందించాలి? అని నేను ఆలోచించాను సమాధానంగా ఈ జవాబు లొచ్చాయి

నేరాన్ని నాలుగువంతులు చెయ్యాలి. నాలుగు వంతుల్ని నలుగురికి పంచాలి. 1. తల్లిదండ్రులు, 2. పోలీసు, 3. కిష్టిగాడు, 4 కుర్రాడు—

ఇలా ముగించి, కాయితాలు కవరులో భద్రంగా పెట్ట, ఒక పత్రికకు ఎడ్రెస్ రాస్తూ వుంటే, అసంతృప్తి కలిగింది చివరి పేరామీద ఎమ్ఫసిస్ లేదని, (పుకారు) కమ్యూనిస్టు సలహా పాటించలేక పోయానేమోనని అనుమానం కలిగింది

ఇంకొక అనుమానంకూడా ఒచ్చింది - శీర్షికకూడా మార్చకపోతే బాగోదని చివరి కాగితాన్ని మళ్లా చించేసి ఆలోచించి, ఇంకో కాగితంమీద రాశాను :—

"ఇంత చిన్నవయసులో, ఇంత పరిజ్ఞానాన్ని, ఇంత ప్రపంచానుభవాన్ని ఆ కుర్రవాడెక్కడ నేర్చుకున్నాడు? ఎలా నేర్చుకున్నాడు? ఎవరిదగ్గర? - అని ప్రశ్నించుకున్నా

"నా కళ్ళఎదట నిలిచిందొక భయంకర రాక్షసి, పొగలు క్రక్కుతూ వుంది సిమెంటు చప్టాలాంటి ఛాతీ, పెద్దఉదరం, ఛాతీమీద తేలిన ఇనపకమ్ముల నరాలు, నరాలమీద ఏవో పురుగులు అటూ, ఇటూ ప్రాకుతున్నాయ్ "ఆ కుర్రాడికి చదువు చెప్పిన గురువును నేనే" అంది.

"నువ్వా?" ఆవటిల్లిపోయాను.

"అవును ఆ కుర్రాడికి పరిజ్ఞానాన్నిచ్చిన పాఠశాలని నేనే"

"అతన్ని ఈవిధంగా తయారుచేశావా?" భయపడ్తూ అడిగేను.

"అవును. అతన్ని ఈ విధంగా పోతపోసిన కార్ఖానాని నేనే రోజూ ఇలాంటి వారిని ఎందర్నో పోతపోసి, పంపుతుంటాను ప్రపంచంలోకి" ఇంజను అరుస్తున్నట్టుంది అది మాట్లాడుతుంటే.

"నాకు అర్థంకాలేదు ఎవరు నువ్వు?"

"నేను బెజవాడ స్టేషన్ని. ఈ 'వ్యవస్థ' ప్రతినిధిగా ఒచ్చాను" మాయమైంది.

ఇలా రాసి, శీర్షికని "పాఠశాల" అని దిద్ది, పోస్టుచేశాను ఒక పత్రికకు. రెండో పక్షం నాకొక బుక్‌పోస్టు వచ్చింది. విప్పి చూచాను. విచిత్రం! అందులో నేను 2 సార్లు కాయితాలు చించేసి, బుర్ర బద్దలుకొట్టుకుని, మార్చిమార్చి రాసిన చివరి పేరా అందులో అసలు లేనేలేదు.

మొత్తానికి నా కథ అచ్చుఅయినందుకు సంతోషించాను. మొదట సలహా ఇచ్చిన మా ఊరి ఏకైక కవిని నాలుగుబూతులుతిట్టి, కలం తీశా రెండో కథకి ★

ఒక భార్యాభర్తా హోటలుకు వెళ్లేరు. బయట్కు వెళ్లిపోతూ గుమ్మందాకా వచ్చేక తన రుమాలు కనబడటంలేదని ఆవిడ గుర్తించుకుని, భర్తను అక్కడే ఆగమని చెప్పి, తాము కూర్చున్న బల్లదగ్గరకు వెళ్లి, క్రింద వెతుకుట ప్రారంభించింది. హోటలు యజమాని అక్కడకు తొందరగా వెళ్లి "అమ్మా ఇక్కడ వెదుకుతారేం, మీతో వచ్చినాయన గుమ్మముదగ్గర వున్నారు" అన్నాడు.

—సి బి. జగన్నాథరావు, కాకినాడ.



పక్షితీర్థం

—ఫొటో : వి. పుల్లేశ్వర్, విజయవాడ.

# పెద్ద మనిషి

**విట్టల శ్రీరామమూర్తి**

చలపతిరావుకి రాంపురంలో వుద్యోగం దొరికిందన్న మాట వినగానే శారద ఎగిరి గంతేసింది 'అమ్మయ్యా! ఎన్నాళ్ళకి! ఇంక తనూ, తన భర్తా హాయిగా స్వేచ్ఛగా, ఒకరి హక్కూ పోరూ లేకుండా నిర్భయంగా జీవించవచ్చు.' తెగిన రెక్కలు తిరిగి పెరిగిన పక్షిలాగ ఎంతో సంబరపడింది శారద. రాంపురంలో తాము వుండబోయే ఇల్లూ, తమ స్వంత కాపరానికి అవసరమైన సామాన్లూ, తనూ, చలపతీ, చిట్టి మాధవుడూ గడపబోయే మధురక్షణాలూ తలుచుకుంటూ ఎంతో మురిసిపోయింది. 'ఇంక తన యిల్లూ; తన సంసారం, తన వ్యావృత్తి తనది'—"ఈ వస్తువు నాది, నా యిష్టాన్ని నేనిలా ఇలా జరిగించుకుంటాను, ఎవరికీ సమాధానం చెప్పుకోవల్సిన పనిలేదు" అనుకుంటూ చిన్నిపిల్లలు గుజ్జనగూళ్ళ ఆటలో పెద్దరికం చూపిస్తూ ఎంత సరదాగా వుంటారో అంతగానూ సరదా పడింది ఇక తమకి ఏది కావలిస్తే అది వండుకోవచ్చు అత్తగార్ని "ఇవాళ ఏం వండమంటారు?" అని అడిగి ఆవిడ ఆర్డరు ప్రకారమే చెయ్యనక్కర్లేదు. తమకి ఎప్పుడు సినిమాకి వెళ్ళాలనితోస్తే ఆ రోజు వెళ్లొచ్చు. ఒకరు ఏమనుకుంటారో అనే జంకూ బిడియమూ పడనవసరం లేదు. నలుగురు స్నేహితుల్ని పిల్చినా, నలుగురింటికి వెళ్ళినా తనని 'ఇంతసేపూ ఎక్కడ పెత్తనాలు వెలగబెట్టున్నావో' అనే సాధింపు లుండవు—అనుకుంటూ తన గత జీవితంలోని అనుభవాల పునాదులపైన ఏవేవో కోరికల్నీ, వూహల్నీ నిర్మించుకుంటూ చిన్న స్వర్గాన్ని సృష్టించుకుంది శారద తన భావప్రపంచంలో 'ఇన్నాళ్లూ, తెల్లవారగట్ల లేచింది మొదలు రాత్రి పదింటిదాకా అనునిత్యమూ జీతంలేని పని పనిషిలా, ఇంట్లో అందరికీ చాకిరీచేస్తూ, అత్తమామలకి అగ్గగ్గలాడుతూ, అందరి సదుపాయాల్నీ తనే చూసుకుంటూ, తన ఇష్టాయిష్టాలు, ఆశా నిరాశలు తనలోనే దిగమింగుకుంటూ ఎల్లా జీవించగలిగేనా' అని ఆమెకు ఆశ్చర్యం కలిగింది తలుచుకున్న కొద్దీ

క్రమంగా చలపతీ శారదా రాంపురం ప్రయాణంరోజు దగ్గరబడింది. ఆ రోజుల్లో శారదలో ఎక్కడలేని వినూత్నోత్సాహం, సజీవశక్తీ కనిపించాయి ఇంట్లో పనులన్నీ అతి శ్రద్ధతో అత్తగారి నోట్లోమాట నోట్లో వుండగా జరిగించేసేది. శారద ప్రతిరోజూ ఇంత కలివిడిగా ఎందుకు వుండలేకపోయిందని ఆశ్చర్యపడిన అత్తగారికి శారద కిదో విజయం తనమీద అన్న ఈర్ష్యాభావం కలగక పోలేదు

మర్నాడే మెయిలుకి ప్రయాణం. సామాన్లూ అవీ సర్దుకుంటూ ప్రయాణ సన్నాహంలో పడింది శారద. ఆరాత్రి ఆమెకి నిద్రబట్టలేదు. మర్నాటి తమ ప్రయాణం గురించీ, రాంపురం ఎల్లా వుంటుందో అనీ, ఇరుగుపొరుగువాళ్ళు మంచివాళ్లైనా అనీ, తమ స్వంత ఇంటిలో రోజూ చేసుకోవల్సిన ఏర్పాట్లు గురించీ ఆలోచనలతోనే గడిచిపోయింది రాత్రంతా.

ఏం పెద్దుబండీలో ట్రంకులూ, బెడ్డింగూ పాత్రసామాన్ల మూటలూ వగైరా అన్నీ సర్దేశాడు అప్పుడు చలపతి గ్లాస్గో పంచా, ఆకుపచ్చని బేజరు కోటూ, ధరించి, కోటు బొత్తాలముందు, అంచులు రెండు చేతుల్తో ముందుకి లాగి, పట్టుకుని, అకుచెప్పులు చప్పుడు చేసుకుంటూ, "రా, రా, టైం అయిపోతోంది" అని కొందరజేసేసు శారద ఒకచేత్తో మాధవుని ఎత్తుకుని, రెండో చేత్తో మరచెంబు పట్టుకుని 'వెళ్ళొస్తానత్తయ్యా' అని బండెక్కింది. కోడలి వుత్సాహం చూసి ఈర్ష్యతో లక్ష్మమ్మ మొహం ముడుచుకుపోయింది కోడలితో తనకేమీ ప్రమేయము లేనట్లూ, మాధవుడు తన కొడుకు కొడుకు మాత్రమే అనే భావంతో చేటట్లు వాణ్ణి ఒక్కసారి ముద్దు పెట్టుకుని బండిలోకి అందించింది, అప్పుడు ఎద్దుతోక మెలివేస్తున్నాడు. బండి జోరుగా నడుస్తోంది. గూడు సందుల్లోంచి ఎండ గుండ్రపు ముక్కలుగా శారద వంటిమీద పడుతున్నాయి ఆమె ముక్కల వాయిలుచీర కట్టుకున్నట్లుంది. బండి కుదుపుకి ముక్కు దురద పెట్టి, చూపుడు వేలుతో ముక్కుని ఇటూ అటూ రాస్తున్నాడు చలపతి. శారద ఆలోచనలు బండికంటే ముందుగా పరుగెత్తి స్టేషను చేరుకున్నాయి

రైలు బుసలుకొట్టూ జరజరా పాకిపోతోంది. తాను స్వతంత్ర జీవనం చేయబోతున్నాననే సంతోషం ఓప్రక్క, తన ముసిలి తల్లిదండ్రులను వదిలిపెట్టి వెళ్ళిపోతున్నానే అనే విచారం ఓ ప్రక్క చలపతిని క్రమ్ముకున్నాయి విభిన్న ఆలోచనలతో మౌనంగా, ఇంటికి మరలిపోయే అప్పడి ఖాళీబండిని చూస్తూ కూర్చున్నాడు రైల్లో. సరీగ్గా ఆరేళ్ల క్రితం తను కాలేజీలో చేరటానికి మొదటిసారిగా తమ వూరువదలి పొరుగూరు వెళ్తున్నప్పుడు, శెలవు లాఖరిని తిరిగి కాలేజీకి వెళ్లేటప్పుడూ, ఆ విరామమయమైన స్టేషను రోడ్డూ, ఇరుప్రక్కలా దట్టంగా తోటిచెట్లూ, సగం పగులుబారిన తూమూ - అన్నీ రైల్లోంచి చూస్తూంటే ఓ విధమైన బాధా, మనస్సులో వెలితీ, బెంగా అతనిలో కలిగేవి. మళ్ళీ ఈనాడు అదేవిధంగా చలపతి హృదయం బరువెక్కింది

ఇంక శారద సంగతి - పదేళ్ల కుర్రాడు మొట్టమొదటిసారి రైలుప్రయాణం చేసినపుడు పడే వుబలాటం, వుత్సాహం ఆమెలో కన్పిస్తున్నాయి. వాటి అడుగు జాడల్లోనే ఓ విధమైన విచారమూ, బెంగా ఆవరించేయి ఆమె మనస్సులో ఆమెకి తెలీకుండానే అంత సంతోషంలోనూ అంత వ్యాహినిలా ఏవిటో చెప్పలేని ఆరాటం బాధా మెదుల్తున్నాయి ఆమె నాలుగేళ్లుగా మసలిన గదీ, వాడుకునే అలమారూ, అందులో వస్తువులూ, వంటిల్లూ, తులసికోటా, ఎంత బాధ అనుభవించినా, ఇన్నేళ్లుగా గడిపిన అత్తమామలతోటి అనుబంధమూ అన్నీ విడిచిపోతున్నానే అనే ఓ విధమైన బెంగ ఆ మనస్సుని దిగలాగుతున్నాయి. రైలు కిటికీలోంచి చూస్తూ కూర్చుంది శారద. మాధవుడు పాలు త్రాగుతూ ఆమె ఒడిలోనే నిద్రపొయ్యాడు. చెట్లు వెనక్కి వెళ్ళిపోతున్నాయి అతి వేగంతో చలపతి వూరికేసి. ఏ చీకూ చింతా లేకుండా హాయిగా నిశ్చింతగా నిద్రపోతోన్న మాధవుడి అమాయికపు మొహం చూసేసరికి అత్తగారి మొహం జ్ఞాపకం వచ్చింది శారదకు. తను పడిన ఆనందానికి తనకే సిగ్గువేసింది. ఆవిడకి తనేదో అపచారం చేస్తూన్నట్లు బాధపడింది ఆమె

మనస్సు. 'ఒకవేళ తన్ను తాను వంచించుకోటం లేదుకదా?'

ఇంతలో రాంపురం సమీపిస్తోందని తెలియగానే శారదలోని అనుమానాలూ, ఆందోళనా ఎక్కడివక్కడ ఎగిరిపోయాయి హడావిడిగా సామాన్లు దించుకుని, బండి మాట్లాడుకుని 'కొత్తయిల్లు' చేరుకున్నారు

మర్నాటినించీ సంసారం చక్కదిద్దుకోడంలో మునిగిపోయింది శారద. ఉదయం పదిగంటలకల్లా చలపతి భోంచేసి ఆఫీసుకి వెళ్లిపోయేవాడు. అతను తిరిగి సాయంత్రానికి వచ్చేదాకా అంతా తీరుబడే. ఇంట్లో మిగిలేది తనూ మాధవుడూనూ. ఇల్లంతా చిన్న

# ★ పెద్దదిక్కు ★

పోయినట్లుండేది. శారదకేం తోచేదికాదు. వచ్చిన కొత్తలో తను కల్పించుకున్న వూహాల్ని సార్థకం చేసుకుంది కాని, ఆ టిఫిన్లూ, షికార్లూ, సినీమాలూ, ఆ సరదాలన్నీ కొద్దిరోజుల అనుభవంతోనే తీరిపోయాయి అనేవారు లేకపోయినా, పదిమందిలో మసలడానికి అలవాటుపడ్డ శారదకి ఒక్కర్తే విచ్చలవిడిగా తిరగటానికి మనసొప్పలేదు తను వూహించిన సౌఖ్యాలన్నీ స్వల్పవిషయాలనీ, అసలు జీవితాన్ని నడిపే శక్తి, ఆ ప్రేమానుబంధమూ, లక్ష్యమూ వేరనీ అనిపించింది ఆమెకు ఇంట్లో ఎదుట నలుగురూ తిరుగుతూ, ఆడుతూ, పాడుతూ వుండాలని అభిలషించింది ఆమె వున్నట్టుండి అత్తగారు జ్ఞాపకం వచ్చింది విశాలమైన ఆమె మొహం, అడ్డబాస, కాటుక కళ్ళూ, కాళ్ళకి అందెలూ, కడియాలూ, పట్టుచీరా, రవికా తొడుక్కుని ఆవిడ సింహంలా అలా సావిట్లో గుమ్మంవగ్గర కూర్చుంటే పదిమంది పెట్టుగా ఇల్లు ఎంతో నిండుగా వుండేది. ఆవిడ వుంటే బాగుండు ననిపించింది మళ్ళీ ఆ చాకిరీమాటా, తనకీ ఆవిడకీ గతంలో జరిగిన ఘర్షణలూ జ్ఞాపకం వచ్చి బెదురుపడేది ఆమె మనస్సు

శారద రాంపురం వచ్చిన రెండో రోజు నిలావుంది, పొద్దెక్కి లేచింది ఎప్పుడు లేచినా అడిగేవారు లేరనీ, తను పెందరాడే లేచేబాధ తప్పిందనీ సంతోషించింది కాని శారదకివున్న పనంతా ఆ వుదయం పది గంటల్లోపునే. ఇంకా కాఫీ అవలేదా అని విసుక్కుంటాడు చలపతి మూల మాధవుడు పాలకోసం ఒహాటేగోల వాణ్ణి సముదాయించేసరికి బ్రహ్మప్రళయ మయ్యేది వాడికి పాలుబటి, నీళ్ళుపోసి, బట్టలు తొడగటం, మరోప్రక్కని పదిగంటలకల్లా వంట సిద్ధం చేయటం - వుక్కిరిబిక్కిరిఅయింది శారద మర్నాటినుంచీ పెందరాడే లేవటం మొదలెట్టింది కాని ఆమె కిప్పుడంత కష్టం అనిపించటంలేదు. తన్ను పెందరాడే లేవమని అత్తగారు అంటోందనే వుక్రోషంకొద్దీ ఆమెకలా ఆలస్యంగా లేవాలనిపించిందికాని ఇప్పుడు ఎవరూ అడ్డుపెట్టేవారు లేనందున ఆ అభిప్రాయమేపోయి తన భర్తకోసం, తన మాధవుడికోసం తనంతట తనే పెందరాడే లేవటం మొదలెట్టింది

మరి నాలుగురోజులుకి మాధవుడికి జ్వరం తగిలింది. ఇదివరలో వాడికి నీళ్ళుపొయ్యటం ఆడించటం అంతా లక్ష్మమ్మగారే చూచుకునేది ఇప్పుడు శారద కొత్తగా వాడికి నీళ్ళుపొయ్యటం మొదలెట్టేసరికి వాడు చేతుల్లో నిలవకా, నానిపోయి క్రమంగా రొంప జ్వరంలోకి దింపింది. ఆ జ్వరం నాలుగురోజులుదాకా విడిచిపెట్టలేదు. మాధవుడు మధ్యమధ్యని 'మామ్మామ్మ' అంటూ మారాము చేసేవాడు రాత్రిళ్లు ఎవర్నీ నిద్రపోనిచ్చేవాడు కాడు. శారదకి ఆ నాల్గురాత్రులూ కంటిమీద కునుకులేదు, ఆ జ్వరం ఎప్పటికీ తగ్గదేమో అని భయంవేసింది. వున్నట్టుండి అత్తగారుంటే బాగుండు ననిపించింది శారద కే మనస్సుకి ఆవిడయితే ఆ మాటలూ ఈమాటలూ చెప్పి పాటల్లో కథల్లో వాణ్ణి వూరుకోబెట్టేది ఆవిడతో వున్నన్నాళ్ళూ మాధవుడికి బెంగ వుండేది కాదు ఆవిడ అలా మాధవుణ్ణి చేరదియ్యటం వల్ల తనకు ఎంత వీలు యిచ్చేదో ఇప్పుడు తెలిసివస్తోంది. ఆవిణ్ణి రమ్మని వుత్తరం వ్రాయమని చలపతిని అడుగుదామనుకుంది. మళ్ళీ ఏం గొడవలు వస్తాయో, సాఫీగా పోయే తమ సంసారంలో ఏం అశాంతి రేకెత్తుతుందో అని భయపడి ఆ ప్రయత్నం మానుకునేది

ఇంక అప్పుడప్పుడు చలపతి వేళాకోళాలు సకేసరి "స్కూలుఫైనలు ప్యాసయ్యావన్నమాటేగాని వంకాయకూరొండడమేనా చేతకాదు నిజంగా మా అమ్మేచేస్తే?" అన్నాడో రోజున ఓ రోజున ఎంతకీ మాధవుడు పడుకోలేదు తనేదో పాడబోయింది అప్పుడే ఇంట్లోకి అడుగెడుతున్న చలపతి "ఏమేవ్ గట్టిగా పాడేవు గనక చుట్టుప్రక్కల పడుకున్నవాళ్ళు లేచి కూర్చుంటారు!"

మరో రోజుని మాధవుడు మరీ కింక పోరుపెట్టేడు ఏమన్నా, ఏం చేసినా వూరుకోలేదు చివరకి చలపతికికూడా లొంగలేదు శారదకేం అర్థంకాలా, ఏం చెయ్యటానికీ తోచిందికాదు. నిక్షేపంగా అంతవరకూ పాలుతాగి ఆడుకుంటూన్న వాడల్లా వున్నపళంగా మొదలెట్టేడు ఏడుపు ఎదురింటిలో వరసమ్మగారు "దిష్టి తీసి పారెయ్యండమ్మా" అని చెప్పింది అంటే ఏంచెయ్యాలనే శారద చూపులు చూసి ఆవిడే ఆ పని కాస్తాచేసి చక్కాపోయింది. వెంట అంత గోలచేసినవాడూ నవ్వుతూ ఆడుకోడం చూసి శారద మొహం 'ఇంతైం'ది

మర్నాడు అంది శారద "మామగార్కి, రమ్మనమని రాయండి మాధవుడు బెంగెట్టుకున్నాడు" 'మాధవుడా? నువ్వా?' అని ప్రశ్నించాయి కొంటెగా చలపతి చిలిపి చూపులు.

"అల్లాగే" అని ఆఫీసుకి వెళ్లిపోయాడు, శారద రాసిచ్చిన తములపాకులు నములుతూ

మాధవుడు 'మామ్మ' అంటూంటే, "మామ్మ వస్తారమ్మా, నాన్నగారు వుత్తరం రాస్తారుగా" అంటూ వాణ్ణి గుండెలికి హత్తుకుంది శారద.

చలపతి వుత్తరం రాసేడు

అక్కడ లక్ష్మమ్మగారిక్కూడా శారద వెళ్ళినప్పట్నించీ ఏంతోచిందికాదు. ముఖ్యంగా మాధవుడు లేని లోటు ఆవిడకి చాలా అనిపించింది తప్పటడుగులు వేసుకుంటూ 'మామ్మామ్మ' అంటూ మాధవుడు తన దగ్గరకి బుల్లిచేతులు చాచుకుంటూ వస్తూంటే తను 'ఎవరొస్తారో ఎవరొస్తారో' అంటూ చటుక్కున వాణ్ణి దగ్గరకు లాక్కునేది ఇంట్లో ప్రతిగదీ, సావిడీ అంతా చిన్నబోయింది వాడు లేకపోతే. వాడి నవ్వులూ, కేరింతలూ, ఏడుపులూ, అల్లర్లూ ఇంట్లోని ఆ నిశ్శబ్దంలోంచి ప్రతిధ్వనించేవి తనూ కోడలూ ఏం మాటలనుకున్నా, ఎన్ని తగువులుపడ్డా మాధవుడిముద్దు మొహం చూసేసరికి ఆవిడ అన్నీ మర్చిపోయేది. తనకి తన భర్తకీ రోజంతా మాధవుడి ఆటపాటల్తోనే గడిచిపోయేది అల్లాంటి పసిపాపను ఇంట్లో లేకపోయేసరికి కడుపులో చల్లచేసి నట్లనిపించింది. మాధవుణ్ణి చూస్తే బాగుండుననుకుంది

శారద గదిలోకి వెళ్లినపుడల్లా ఆమె జ్ఞాపకం వచ్చేది దగ్గరవున్నప్పుడు తాను ఎన్ని కలతలుపడ్డా శారద దూరంకాగానే ఎందుకో కోడల్ని చూడాలనిపించింది లక్ష్మమ్మగార్కి ఆవిడ నిత్య జీవితంలో శారద బాగా అలవాటైపోవడం మూలాన్ని ఆమె లేకపోతే తనకి చెయ్యి విరిగినట్లుగా వుంది ఇప్పుడు రెండుపూటలా తనే చేసుకోవాల్సి వస్తోంది ఏం ముక్కినా మూలిగినా ఇంటిపనులు తప్పడంలేదు శారద రాంపురం వెళ్లినతర్వాత ఆవిడ నాలుగు లంకణాలు చేసింది ఇంటిపనుల్లో ఓపిక లేక. మందుకోసం ముసిలాయన తిరగాల్సి వచ్చింది. చలపతి లేకపోవటం మూలాన్ని బజారుపనులూ అవీ ఆయనపై బడ్డాయి ఆవృద్ధాప్యంలో

"అబ్బాయివుంటే బాగుండును" అనుకున్నాడు ఎన్నిమారులో. ఆవిడ జ్వరంతో వున్న నాలుగునాళ్లూ ఆయనే మడిగట్టుకోవల్సి వచ్చింది "ఎందుకొచ్చిన పాట్లు? శుభ్రంగా కొడుకూ కోడలూదగ్గర వుండక" అని విసుక్కున్నాడు. ఆవిడకీ అదే అనిపించింది, భర్త తనమూలాన్ని కష్టపడుతున్నాడని బాధ పడింది. శారదవున్న

రోజుల్లో తనకేం జబ్బు చేసినా రాత్రింబవళ్లు కనిపెట్టుకు కూర్చునేది టయిము ప్రకారం మందూ అదీ ఇచ్చేది శారదని చూడాలనిపించింది "పోనీ అబ్బాయికో వుత్తరం రాస్తారేమిటి?" అంది

ఆరోజే చలపతి వుత్తరం అందింది. "ఏమేవ్, వాడే రాసేడే" అని చదివి వినిపించేడు

ఆవిడ జ్వరంనిమ్మళించగానే శ్యాంపురం ప్రయాణం కట్టేరు ముసిలిదంపతులు దారి పొడుగునా మాధవుణ్ణి 'ఎప్పుడు చూస్తానా' అని ఆత్రుతపడుతూనేవుంది ఆవిడప్రాణం

ఇంటికి రాగానే, మాధవుడు ఒక్క ఎగురు ఎగిరాడు మామ్మపైకి, తన బుల్లి పాదాల్తో ఆవిడ గుండెలమీద పరవళ్ళు త్రొక్కేగు

"అప్పుడే అల్లా చిక్కిపోయాడు" అంది లక్ష్మమ్మ మాధవుడి తల నిమురుతూ

"బెంగెట్టుకున్నాడత్తయ్యా మొన్ననే తగ్గింది జ్వరం" అంది శారద

కొంతసేపు వాడిఆటల్తో గడిచిపోయింది. ఇంతలో చలపతి ఆఫీసునించి రావటంతోటే అందరూ కబుర్లలో పడిపోయారు.

శారద అనుకుంటుంది, ఇంక తనకి విషమ పరీక్ష ప్రారంభమైందని అందుగా తమ వుత్తరంవల్ల మరీ లోకువైపోతానేమో అని భయపడింది

లక్ష్మమ్మగారి మనస్సులో ఆవిడా అనుకుంటూంది, కోడలు మళ్ళీ తగవులు మొదలెట్టుందేమో అని ఇద్దరూ వాళ్లవాళ్ళ వుద్దేశ్యాల ప్రకారం త్యాగం చేస్తున్నామనీ అనుకుని అందుకు సిద్ధపడివున్నారు

లక్ష్మమ్మకి శారదగారింటికి రాగానే ఓ క్రొత్త వాతావరణంలోకి వచ్చినట్లనిపించింది తన ఇంట్లో తను వుండగా శారదని మామూలుగా ఆజ్ఞలుపెట్టి పనిచేయించుకున్నట్లు, శారద ఇంట్లో తను చెయ్యలేకపోతోంది ఏదో వక చెప్పలేని ఆటంకం అంతరాత్మలోంచి ఆవిణ్ణి వెనక్కిలాగుతూ, 'ఇది శారద యిలు నీవు మునుపటిలా ఆమెని ఆజ్ఞ పెట్టడానికి వీలులేదు' అని హెచ్చరిస్తున్నట్లు అనిపించింది అప్రయత్నంగా, ఆవిడ అందామనుకున్న మాటలు లోలోపలే వుండిపోతున్నాయి దాసీది, పాలవాడూ, చాకలీ అంతా శారదనే అమ్మగారంటూ ఆమె యజమానిగా వ్యవహరిస్తున్నారు

దాసీదాన్ని ఆవిడ కేకలువేసి పనులు చేయించుకుందామనుకుంటూనే అది శారద దాసిదనే, తలపు అడ్డువచ్చి ఆగిపోయేది ఇప్పుడు తన వ్యక్తిత్వం, తన ప్రాముఖ్యత ఏమైపోయాయి అని ఆశ్చర్యపడింది ఆ ఇంట్లో శారదే యజమాని, తను పైమట్టం మాత్రమే అనీ అభిప్రాయం దానంతటదే ఆవిడలో ఏర్పడి, తను ఇకముందు యజమానిగా అధికారం చలాయించటం అసహజం అనిపించింది

శారద నిత్యం తను యింట్లో జరుపుకునే పద్ధతుల్తో సహజంగా తను ఇంటి యజమానిలాగే ప్రవర్తిస్తోంది. ఆవిడ వచ్చింది కదా అని అన్ని విషయాలూ ఆవిడకి చెప్పి తను కేవలం ఆవిడ చేతిక్రిందవుండి చాకిరీ చేయటం మొదలెడితే మునపటి తగవులూ, మనస్పర్థలూ మళ్ళీ రేకెత్తుతాయేమో అని భయపడింది ఇంటపనులన్నీ తనే చేసుకుంటూ, ఆవిడకి ఏ శ్రమా లేకుండా—మాధవుడితో ఆడుకోటం తప్ప—అవసరమైన విషయాలు ఆవిడని అడిగి తెలుసుకుంటూ కాలం గడపాలనుకుంది ఆమె నడతలో ఆవిణి ధిక్కరించటంగాని, 'నేనే యజమానిని సుమా' అనే హుందాతనం కాని లేదు తన అధికారంపోయిందే అని ఆవిడ బాధపడకుండా, ఆవిడ మనస్సు

నిరుద్యోగంతో యమయాతన పడుతున్న ఓ యువకుడికి రోడ్డుమీద అకస్మాత్తుగా దేవుడు ప్రత్యక్షమై ఓ వరం కోరుకోమన్నాడట!

యువకుడు చేతులు కట్టుకొని సవినయంగా—

"ఏం వద్దు యిప్పట్లో—పై జన్మలో మాత్రం నన్ను ఓ మంత్రిగారి ఏకైక పుత్రికగా పుట్టించు భగవాన్" అన్నాడట!

కృష్ణుడు బడికి రోజూ ఆలస్యంగా వచ్చేవాడు. ఎన్నిసార్లు చెప్పినా వినలేదు. ఆఖరికి ప్రాణం విసిగి ఒకనాడు మేష్టారు చితుకకొట్టెరు కొట్టి, "ఒరే! కృష్ణా! నిన్ను ఎందుకు కొట్టనో తెలుసా?" అని అడిగినారు దానిమీద వాడుఏడుపు ఆపుకుని, "బాగుందండి అయినవాడికి నన్ను చావకొట్టేరు. ఎందుకు అలా చేసేరో కూడా యిప్పుడు మీకు తెలియదన్న మాట" అని జవాబిచ్చాడు

—సి బి జగన్నాధరావు, కాకినాడ

మల్లయుద్ధం

## ★ పెద్దదిక్కు ★

చెప్పించకుండా తను చేసే పనులన్నీ ఆవిడ చేత అవుననిపించుకునే చేద్దామనుకుంది శారద.

ఓనాడు - "అత్తయ్యా ఇవ్వాళ ఏం కూర వండమంటారు?" అంది శారద

"నన్ను అడిగేదేమిటే, వాడికీ నీకూ ఏం ఇష్టమయితే అదే వండు" అంది లక్ష్మమ్మ గారు ఆ అన్నదికూడా మామూలుగా సహజధోరణిలో అన్నది కాని, ఓ ఎత్తిపొడుపులా కాని, 'ఇక్కడ నా ప్రయోజకత్వం ఏముంది వెలిగిస్తున్నావుగా నీ ప్రభ' అని నిష్ఠురంగా అన్నట్టు కానిలేదు శారద కూడా అత్తమామల రుచుల్నీ అవసరాల్నీ తెలుసుకుని వాళ్లకి తృప్తికలిగించేలాగే మసలుకుంటోంది

మరో రోజు—

"సినీమాకి వెళ్తున్నాం అత్తయ్యా"

"అల్లాగే వెళ్లిరామ్మా మాధవుడు లేస్తే నేను చూసుకుంటానులే మీరు వెళ్లండి" అని లక్ష్మమ్మ జవాబు

అత్తగారి ప్రవర్తన శారదకెంతో ఆశ్చర్యం కలిగించింది పూర్వపు అథార్టీ లేదు, అధికారం పోయిందనే ఉక్రోషం లేదు ఎంతో చనవుగా, ఆప్యాయంగా, తల్లిలా కష్టసుఖాలు గమనించి మసలుకుంటోంది

ఇహ లక్ష్మమ్మగారి ఆశ్చర్యం సరేసరి శారద తన ఇల్లుగదా అని ఆవిడమీద అథారీ చేయటంలేదు ఎక్కడికి వెళ్లినా, ఏపని చేసినా, 'నా ఇష్టం నీకేం పోసిపొమ్మని' విర్రవీగకుండా తన్ను అడిగి సరే అనిపించుకుని మరీ చేస్తోంది

రోజులు దొర్లుకుపోతున్నాయి సంవత్సరం గిరగిరా తిరిగివచ్చింది ఆ రోజు రాత్రి—

శారద తమలపాకులు చిలకలు చుట్టియిస్తూంటే చలపతి ఒక్కటొక్కటి వేసుకుంటూ అన్నాడు

"చూడు శారదా సరిగ్గా ఏడాది క్రితం ఈ రోజుని వచ్చేం ఈ వూరు ఈలోగా ఎన్ని మార్పులు! అందరం ఇల్లా పొత్తుగలిసి ఉండడం మన అదృష్టం"

శారద, ప్రక్క వుయ్యాల్లో నిద్రపోతూన్న మాధవుడి కేసి చూసిన చూపు అర్థంచేసుకుందుకి చలపతికి ఆట్టే సేపు పట్టలా ★

# బొమ్మరిల్లు

## అసలు రహస్యం

'పతంజలి'

తీయతీయగ పాడుకుంటూ
హాయిహాయిగ ఆడుకుంటూ
సోలితేలే తేనెటీగను
చూచి ఆపీ, పలికరించెను
కందిరీగ—

"తమ్ముడూ - ఈమాట చెప్పూ
ఎల్లవారలు నన్ను జూచీ
ఈసడింతురు విషయమేమో?
మేల్మిబంగరు మేనిఛాయలు
మనుషు లెందుకు మరతురయ్యా??
నిన్ను జూచీ మిన్నగానే
గారవింతురు కతమ్మేమో ?"
ముక్కుసూటిగ మాటలాడెను
తేనెటీగ—

"ముక్కు చివరల కోపమున్నది
ఎక్కువున్నది !
మాటిమాటికి ముల్లు(గుత్తువు
కందిరీగ !—

నాకు కూడా చిన్నముల్లూ
ఉన్నదయ్యా - ఇదే చూడూ!
నేను మాత్రం అస్తమానూ
కుట్ట నెవ్వరి నేడిపించను!
మనసూ మంచిదాయె
అదే కాదు—
పను లెన్నో వున్నవాయె
ఇదే కాదు—
నా దారే నాదయ్యా—
అంతా నావారయ్యా !!"

## పాత పాటలు

(సేకరణ వేదుమళ్ళ కామేశ్వరరావు)

### పల్లకిలో సీతారాములు

పల్లకీ పసుపాయె దండిపసుపాయె
మేము మోయు రాముడు దిశకెల్లపసుపు
దశరథునికోడలు సీత ఆపాప
ఆపాప మసలంగ భువియెల్ల పసుపు

### సీతారాముల పెళ్ళి

కస్తూరి గలచోట కన్నె గలచోట
విస్తరించోక రాజు విడిది దిగినాడు
ఓ రామ వచ్చేవు! ఓ యి వీరుడ!
అరుగుమీదే పెళ్లి, ఓలి ముప్పయి
తల్లిగట్టిన చీరె తగును పెళ్లికి.





# కర్పూరద్వీపయాత్ర

(బొమ్మరిల్లు సీరియల్) నోరి నరసింహశాస్త్రి

## 12

పౌరాణికుడు ఆ ఘట్టానికి వచ్చేసరికి శ్రోతలంతా ఆనందంతో తబ్బిబ్బులవుతున్నారు గగు ర్పాటు పొందిన దేహాలతో ఆనందబాష్పాలు కారుస్తూ గద్గద కంఠాలతో విదేహరాజు మహత్తును శ్లాఘి స్తున్నారు. ఆ సందడి విని కలలోనుంచి మేలుకొన్నట్లు మహారాణి ఉలిక్కిపడి "ఏమిటి? ఏమిటి?" అని అడిగింది.

"ఏ లోకంలో ఉన్నావు, మహారాణీ!" అంటూ కోశాధిపతి భార్య చిరునవ్వు నవ్వింది.

గాయకుని భార్య కళ్లలో నవ్వు తరళంగా ప్రకాశిస్తూ తాండవమాడింది

రాణికి కోపము వచ్చింది. కాని ఎవరిమీద?

ఇంతసేపూ ఆవిడ ధ్యానమంతా తాను పిలవనంపితే రాకపోయిన మంత్రి భార్యమీదనే ఉన్నది. సావాసగత్తెలంతా తోడుగా ఉంటేనేగాని ఆవిడ ఏదీ బాగా అనుభవించలేదు —ఆనందమే కానీ, మరొ కటే కానీ!

మంత్రి భార్య ఎందుకు రాలేదూ?—ఈవిడ ఎందుకు రాలేదూ?—పోనీ తనకోసము వచ్చిన చేటికనుగూడా తనదగ్గరే పెట్టుకున్నదే, దాన్నైనా పంపించగూడదూ?—ఇట్లా ఆలోచిస్తూ ఉన్నది.

ఏనా పురాణంలో మాటలు మధ్యమధ్య అసలు చెవిని పడకపో లేదు.

"రాజ్యాంతే నరకం ధ్రువమ్!" అన్న మాటలు వినపడ్డవి. భార్య మాటలు విననందుకు విదేహ రాజు నరకానికి రావలసివచ్చిందన్న మాటలు కూడా వినపడ్డవి.

అందులో ఆ రెండో వాక్యం గట్టిగా ఆ పెంకెరాణి మనస్సులో నాటుకున్నది. అదే ఇంతవరకూ మాటిమాటికీ మననంచేస్తూ ఉన్నది

అందుకనే, సావాసగత్తెలిద్దరూ నవ్వేటప్పటికి, తన మనస్సులో ఆడుతున్న మాటను వాళ్లు హేళన చేస్తున్నారని తోచి కస్సున కోపం వచ్చింది. ముఖం చిట్లించుకున్నది. ముక్కుపుటాలు అదిరినై. ఒక్క మాటకూడా మాట్లాడకుండా రివ్వున ఆమె తన ఏకాంతమందిరంలోకి బయలుదేరింది. సావాసగత్తె లిద్దరూ వెళ్లివస్తామని చెప్పుతుంటే వాళ్లవైపన్నా రాణి తలతిప్పి చూడలేదు.

సరిగ్గా ఆవిడ వెళ్లుతున్నప్పుడే మంత్రిభార్యకోసము పోయిన చేటిక వచ్చింది. మంత్రిభార్యమాటలు చెప్పింది. 'ఇప్పటిదాకా ఉన్నది ఈ కాస్త మాటకేనా?' అని రాణి దాన్ని కసిరి కొట్టింది. 'వస్తాంటే



రాణి చూస్తూనే, "నిజంగా ?—నిజంగా ?—"
అంటూ వెనక్కు విరుచుకుని సోఫామీద వాలిపోయింది

దారిలో మా బంధువులు కనబడితే మాట్లాడుతుంటే కాస్త ఆలస్యమయిందయ్యా!' అని అది చెప్పాయిన్నది. లాభం లేకపోయింది. చేటికను వెంటనే పనిలోనుంచి తొలగించింది.

## 13

ఆరాత్రి రాజుగారు కబుర్లు చెప్పకోడానికి రాణీగారి మందిరానికి వచ్చాడు. రాణికి చిరాకింకా వదలలేదు. ఆయన మాటలకి పరాకుగా 'ఊఁ, ఆఁ,' అని ఒక్కొక్క అక్షరంతో జవాబులిస్తున్నది.

"ఏకాక్షర నిఘంటువు వల్లెవేస్తున్నావా ఏమి, ఇవ్వాళ?" అన్నాడు రాజు.

"ఆహాఁ!" అంది రాణి విసుగుతో.

"ఓహో, ద్వ్యక్షర నిఘంటువులో పడ్డావే!" అన్నాడు రాజు.

"బాగుంది!" అన్నది రాణి.

"నయమే. ఈమాటు త్ర్యక్షర నిఘంటువులో పడ్డావులే!" అన్నాడు రాజు.

"ఊరుకోండి!" అన్నది రాణి.

"సంతోషమే మాటమాటకూ ఒక్కొక్క అక్షరమే పెరుగుతున్నది" ఇట్లా అంటూ రాజు పకపకా నవ్వాడు

"అందరూ నన్ను చూసి నవ్వేవాళ్ళే! అంత అలుసయిపోయినాను ప్రతివాళ్ళకూ!" అంటూ రాణి

##  కర్పూర ద్వీపయాత్ర 

ఆరున్నొక్కరాగ మారంభించింది, రాగమే కాదు. దానితోపాటు కళ్లలోనుంచి రసప్రవాహం కూడా సాగింది—నీలకంఠాయస్వాహా అని.

ఏదో విశేషమున్న దివ్వాళనని అప్పటికి రాజు గ్రహించాడు. ఆమెను బుజ్జగిస్తూ, "నీ కోరిక ఏమిటో చెప్పు. నిన్ను అగౌరవపరచిం దెవరు?—వాళ్లను నీవు చెప్పినట్లు శిక్షిస్తాను!" అన్నాడు రాజు.

ఆ మాటలతో రాణి రాగమూ రసమూ కాస్త శాంతించినవి. ఎగశ్వాసం వెంటనే తగ్గలేదు. అది కూడా తగ్గిన తర్వాత రాజుగారిని ఇట్లా వరమడిగింది.

"రేపీ పాటికల్లా మంత్రిభార్య కాళ్లు నరికించి తెప్పించాలి! కోశాధిపతి భార్య నాలుక కోయించాలి! గాయకుని భార్య కళ్లు పీకించాలి!—"

అది విని రాజు నిర్ఘాంతపోయినాడు. కాని వెంటనే తమాయించుకొని ఫక్కున వెకిలినవ్వునవ్వుతూ, "ఇదేమి హాస్యము?" అన్నాడు.

రాణి మండిపడింది. కోపము వచ్చిన తాచువలె నిలువున బుసలుకొట్టుతూ నిలుచున్నది. "అబద్ధాలాడడం మహారాజులకే చెల్లుతుంది!" అన్నది.

ఈమాటు మహారాజుకే కోపము వచ్చింది. చివాలున అక్కడినుంచి లేచి నిజమందిరానికి పోయినాడు.

## 14

రాజుగారికీ రాణీగారికీ ఎడమొగం పెడమొగంగా ఉన్నదని ఆర్రాత్రే నగరమంతా పాక్కిపోయింది. తెల్లవారేప్పటికి రాజధానీ నగరమంతా పాకిపోయి రాజ్యం నాలుగుమూలలకూ వ్యాపించడ మారంభించింది.

రాణీగారు కోరిన వరమిస్తానని రాజుగారు ఒప్పుకున్నారట. ఆమె మర్నాడావేళకల్లా మంత్రిభార్య కాళ్లు నరికించమనీ కోశాధికారి భార్య నాలిక కోయించమనీ గాయకుడి భార్య కళ్లు తోడించమనీ కోరుకొన్నదట. రాజుగారు నిరాకరించగా 'అబద్ధమాడతారా?' అని రాజుగారి నడిగిందట రాణి. రాజుగారు కోపంతో అక్కడినుంచి వెళ్లిపోయినారట!—

ఈవిధంగా రాణిగారి చేటికలు రాజుగారి సేవకులు తలకొకటిగా తోచిన విశేషం చేరుస్తూ ప్రచారంచేస్తున్నారు. అంతా గుసగుసలే. బిగ్గరగా ఒక్కరూ అనరు ఆ చిత్రమేమో గాని, బజారులో బహిరంగంగా డప్పువేసి చాటింపుచేసిన ప్రకటనకంటె కూడా, అంతఃపురంలో ఈ మూలను ఆ మూలను చేసుకునే గుసగుసలూ, బావులవద్దా నీలాటి రేవులవద్దా మాట్లాడుకొనే పరమ రహస్యాలూ,—లోకంలో దూరానికీ పాకుతై, తొందరగానూ పాకిపోతై.

మధ్యాహ్నానికల్లా ఈ సంగతి మంత్రి భార్యకు కోశాధిపతి భార్యకూ గాయకుడి భార్యకూ తెలిసిపోయింది. వాళ్లు ఎంత ఆలోచించుకున్నా రాణి కెందుకు కోపము వచ్చిందో స్ఫురించలేదు. ఎవరన్నా చాడీలు చెప్పిఉంటారు. ఎవరి కంత ధైర్యం? అందుకని వాళ్లు ముగ్గురూ కలిసి రాణీ మందిరానికి వెళ్లారు.

వాళ్లు వచ్చారని చేటిక నివేదించగానే రాణీ వాళ్లను తన వాకిట్లోనుంచి గెంటిపారేయమని ఆజ్ఞాపించింది. విధిలేక వాళ్లు ముగ్గురూ, పరీక్షతప్పిన పిల్లలల్లే, ముఖాలు వ్రేలాడవేసుకొని మంత్రిగారి ఇంటికి వెళ్లారు.

## 15

తమ సావాసగత్తెకు అంత కోపం రావడానికి కారణమేమా అని అక్కడ చేరి వాళ్లు ముగ్గురూ మళ్లీ మళ్లీ ఆలోచించుకున్నారు. చివరకు కోశాధిపతి భార్యకు కారణం సరిగ్గా తట్టింది.

"నే నన్నది ఇంతేనమ్మా. 'ఇందాకటినుంచీ నువ్వేలోకంలో ఉన్నావమ్మా,' అన్నాను. ఇంత మాత్రానికే నా నాలుక కోయించాలె కాబోలు!"

గాయకుడి భార్య అన్నదిగదా, "నీవు రాలేదని ఆవిడకు కోపంగా ఉంది కాబోలు, నాకేం తెలుసు! పురాణంలో విదేహరాజు పుణ్యానికి నరకంలో వాళ్లంతా విముక్తి పొందినారని విని ఆనంద పడుతూవుంటే, రాణీ 'ఏమిటి ఏమిటి' అని అడిగింది. ఏ లోకంలో ఉన్నావమ్మా, అంటే నాకు నవ్వు ఆగక నవ్వాను. నా కళ్లల్లో తాండవించిన నవ్వు చూసి నా కళ్లు పీకించమన్నది కాబోలు! ఈవిడతో ఏం వచ్చినా కష్టమేనమ్మా!"

కో. భా : రాణీ కోపము తాచుపాము పగవంటిదమ్మా! పగ పట్టిందంటే సాధించితీరుతుంది. మన మిహా తప్పించుకొనే ఉపాయ మేమిటి?

గా. భా : ఏముంది? దేశం విడిచి పారిపోదాం

కో. భా : ఎక్కడికి పోయినా రాణీ భటులు వెంబడి పడరూ?

గా. భా : ఐతే ఏ నుయ్యో గొయ్యో చూసుకుందాం.

కో. భా : ఎందుకమ్మా మారువేషంతో ఏ అడవిలోకో పారిపోతే సరిపోదూ!—మంత్రిగారు మనకామాత్రం సహాయం చెయ్యలేరూ?—ఏమమ్మా?

చివరి మాటలు మంత్రి భార్య నుద్దేశించి అన్నవి. మంత్రి భార్య మౌన మవలంబించింది. తనను అట్లా పలకరించినా మాట్లాడలేదు. దీర్ఘంగా ఆలోచిస్తున్నది. మిగిలిన ఇద్దరికీ తొందరా ఆదుర్దా ఎక్కువవుతున్నవి.

కో భా : ఏమమ్మా, మాట్లాడవు?

గా భా : నీ వేదో ఉపాయం చెబుతావని గంపెడాశతో ఉంటే, అసలే మాట్లాడవేం?

శాంతంగా మంత్రిభార్య అన్నది : "నాకు పారిపోవడ మిష్టంలేదు!"

కో. భా · ఏం?

మం. భా : ఎక్కడికి పోతే రాజభటులు వెంటరాలేరు?

గా భా : ఏ ముష్టో ఎత్తుకుంటూ దిక్కులేనివాళ్ళవలె పోతేకూడా పోనీదా ఈవిడ?

మం. భా : నా కసలు పారిపోవడమే సమ్మతం కాదు.

గా. భా : ఏం ?

మం. భా · పారిపోతే మనమే ఏదో పెద్ద తప్పు చేసినవాళ్ల మవుతాము లోకము దృష్టిలో.

గా. భా · అయితే ఇక్కడే ఉండీ కాళ్లురెండూ నరికించుకుంటావా?—అయ్యో, నా కళ్లు రెండూ పోతే మిమ్ముల నందరినీ చూచే దెట్లా అమ్మా!

కో భా : కళ్లు పోయినా కాళ్లు పోయినా ఉండవచ్చుగాని నాలుక లేనివాళ్ల బ్రతు కెందుకమ్మా, కడుపులో మాట చెప్పకో లేకుండా!—అయితే, అరటిబోదెలవంటి నీ చక్కని కాళ్లు నరికించుకొంటావా ఏమిటి?

మం. భా : నరికించుకోను.

గా. భా : మరి?

మం. భా : నేనే నరుకుకొని రాణికి నారెండు కాళ్ళూ కానుకగా పంపుతాను.

అది విని వాళ్లిద్దరూ ఒక్కసారిగా హాహాకారాలు చేశారు.

**16**

ఆ సందడి విని అవతల కచేరీసావిట్లో పనిచూచుకుంటున్న మంత్రి అక్కడికి వచ్చాడు. ముగ్గురూ లేచి నిలబడ్డారు.

# ★ కర్పూర ద్వీపయాత్ర ★

"సావాసగత్తెలంతా ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నారు?" అన్నాడు నవ్వుతూ మంత్రి.

కోశాధిపతి భార్యా గాయకుడి భార్యా చెరికాస్త చెబుతూ కథ అంతా చెప్పి చివరకు, "మీఆవిడ చేయదలచుకొన్న సాహసం మీరన్నా మాన్పించి మా కందరికీ ఈ చిక్కులోనుంచి తప్పుకొనే ఉపాయం కాస్త చెప్పి రక్షిద్దురూ!" అని బ్రతిమాలారు.

మంత్రి ముఖాన చిరునవ్వు ఇగురుకుపోయింది. గాఢంగా దీర్ఘంగా ఆలోచించాడు ఆయన ఏమి చెప్తాడో అని వాళ్లిద్దరూ తహతహలాడుతున్నారు. కొంతసేపటికి మంత్రి ఏదో నిశ్చయానికి వచ్చినట్లున్నాడు మాట్లాడబోయినాడు. గొంతు ఎలుగు రాచుకుపోయి నోటమాట రాలేదు. కొంతసేపటికి అతికష్టంమీద మాట పెకల్చుకొని నెమ్మదిగా అన్నాడు:

"మీ సావాసగత్తె నిర్ణయమే ధర్మమని తోస్తుంది."

"అయ్యో, అయ్యో! మీరుకూడా మీ భార్య కాళ్లు, నిక్షేపమంటివి, నరుక్కోడానికి ఒప్పుకుంటారుటండీ?" అన్నది కోశాధికారి భార్య.

"మరి రాజుగారి మాట అబద్ధమైతే లోక మేమవుతుంది?" అన్నాడు మంత్రి.

"అయితే మమ్మలినిగూడా నాలుకా కళ్ళూ తీసి పంపించమనే అంటారా?" అని గాయకుని భార్య అడిగింది.

"ఏమో, అది మీరే ఆలోచించుకోవాలె నీ పెనిమిటినిగూడా అడిగిచూడు!" అన్నాడు మంత్రి.

అంతట మంత్రిభార్య భక్తితో భర్తకు నమస్కరించి పదునైన కత్తి తెప్పించమన్నది. ముట్టుకొంటేనే తెగిపోయేటంత పదునైన కత్తి మంత్రి తెప్పించాడు. దాన్ని చూసేప్పటికే కోశాధిపతి భార్యా గాయకుడి భార్యా ఉలిక్కిపడ్డారు.

మంత్రి భార్య ఆ కత్తి అందుకొని నిశ్చలంగా ఎడమకాలిమీద పెట్టుకొన్నది. వెంటనే ఎడమ కాలు తెగి నేలమీద పడ్డది. తర్వాత అట్లాగే కుడికాలిమీద పెట్టుకున్నది. అదీ అట్లాగే తెగిపడ్డది.

ఆమె అంతట పరిచారికను పిలిచి పెద్ద బంగారపు పళ్లెం తెమ్మన్నది తెగిన తన రెండు కాళ్ళూ ఆ పళ్లెంలో భద్రంగా స్వయంగా తన చేతులతో పెట్టి రాణిగారికి సమర్పించిరమ్మని పరిచారికను పంపింది.

ఇంతసేపూ కాళ్లు రెండూ నెత్తురు వరదలు కారుతున్నా, అప్పటికిగాని కాళ్లకు వైద్యుడిచేత కట్టు కూడా కట్టించుకోలేదు.

ఇదంతా చూస్తున్న కోశాధిపతి భార్య నివ్వెరపోయి ఏడుస్తూ అడిగింది: "అయ్యో! ఎంత సాహసమమ్మా! రెండు కాళ్ళూ కోసుకొనికూడా ఇంతనొప్పి లేనట్లు అట్లా నిబ్బరంగా ఉన్నావు!"

మంత్రి భార్య అన్నదిగదా, "చెల్లెలా! పెద్దచెల్లెలి ముద్దు చెల్లించడంవల్లనూ, రాజుగారి మాట దక్కించినందువల్లనూ, నాకు కలిగే ఆనంద మెంతో ఏమని చెప్పేది! ఆ రెండు సంతోషాల ముందూ తెగిన ఈ రెండు కాళ్ల బాధా చీమ కుట్టినంత నొప్పిగాకూడా అనిపించడంలేదు!"

ఆ మాటలు విని చెలికత్తెలిద్దరూ రారు పుట్టి ఎవరిళ్లకు వారు పరుగెత్తారు.

## 17

సాయంత్రమయింది. సూర్యుడస్తమిస్తున్నాడు ఎర్రగా మంత్రిభార్య కాళ్లనుంచి కారిన నెత్తురు ఒళ్లంతా పూసుకున్నాడా అన్నట్లున్నాడు సూర్యుడు. కాని రాణిముఖం కోపంతో కందగడ్డవలె ఐ అంతకంటె ఎర్రగా ఉన్నది.

"రాజుగారు నాకు వరమిచ్చి చెల్లించుకో [illegible]బద్ధమాడారు. నా కోరిక నేనే తీర్చుకోడానికి ఎవ రడ్డము? నా కంతమాత్ర మధికారమే లేదా?— [illegible]గడువుంది. ముందు మంత్రి భార్య కాళ్లు తెగ

గొట్టడానికి నేనే ఉత్తరువు లిచ్చి తెప్పించుకుంటాను—చేటీ!"

రాణి కేక విని చేటిక వస్తూనే ఇట్లా విన్నవించింది.

"చిత్తము. ఏమి సెలవు? మంత్రిగారిభార్య కానుకతో పరిచారికను పంపింది. లోపలికి రావడానికి సెలవా?"

"ఆవిడ కాళ్లు తప్ప మాకేమీ ఆవిడ కానుక లక్కరలేదు!" అన్నది మహారాణి.

"అవేనట, మహారాణీ!"

"నిజంగానా?—అయితే రానీ ఈఈ—" అంటూ చివరదీర్ఘం తీస్తూనే ఉంది రాణి. ఆ మాట పూర్తిచేసే లోపలనే మంత్రిభార్య కాళ్లుఉన్న బంగారపుపళ్లెము తెచ్చి పరిచారిక రాణీముందు పెట్టి దానిపైన కప్పిఉన్న పట్టుగుడ్డ తొలిగించింది.

అరటితూళ్లవంటి ఆ కాళ్లు ఇంకా పచ్చిరక్తం కారుతూనే ఉన్నవి. కాని అప్పటికే రక్తము తగ్గి సన్నబడి చూడడానికి అసహ్యంగా ఉన్నవి. ఎక్కువ దెబ్బలు తగిలి గాయాలైనవాళ్లను చూస్తే చాలామంది మూర్ఛపోతారు, ఎరుగుదురా? మీరటువంటి వెప్పుడూ చూడబోకండి సుమా!

రాణీ చూస్తూనే, "నిజంగానా?—నిజంగానా?—"అంటూ వెనక్కు విరుచుకొని సోఫామీద వాలి పోయింది. ఆమె రెండు కాళ్లూ ఒక్కసారిగా చచ్చుబడిపోయినై. రాణీ ఏకధారగా కన్నీరు కారుస్తూ ఒకటే ఏడవడం మొదలుపెట్టింది.

గంటసేపు గడిచింది. కోశాధిపతి భార్య కానుకతో పరిచారికను పంపిందని చేటిక నివేదించింది.

"అయ్యో, రానీ!—అయ్యో, రానీ!" అన్నది రాణి.

పరిచారిక వచ్చి రంగురంగుల దంతపు బరిణ ఒకటి రాణీముందు ఉంచి మూత తీసి అందులో తన దొరసాని రాణిగారికి కానుకగా పంపిన నాలుక చూపించింది. అది చూసి రాణి ఆశ్చర్యంతో నోరు తెరిచింది! అంతే! తెరిచిన నోరు తెరిచినట్లే ఉండిపోయింది. మళ్లీ మూతపడలేదు. నాలుక ఆడలేదు అంగిట్లో అతుక్కు పోయింది. అయ్యో, అని అందామని ప్రారంభించిన రెండక్షరాల మాటకూడా 'అ'తోనే ఆగిపోయింది. అదే మాటిమాటికీ ఎక్కిళ్లు వచ్చినట్లు వచ్చి 'అ' తోనే ఆగిపోతున్నది. రాణీకి కన్నీళ్లుమాత్రము ఏకధారగా కారుతున్నవి.

మరొక గంట గడిచింది. మాణిక్యాల బరిణలో పెట్టి తన రెండు కళ్లతో గాయకుడి భార్య పంపిన పరిచారిక వచ్చి రాణీకది సమర్పించింది. అవి చూడగానే రాణీ గుడ్లు రెండూ బయటికి పొడుచుకువచ్చి ఉబ్బి గాయకుడి భార్య కళ్లున్న పెట్టెలో ఊడిపడ్డవి. ఆపైన ఇహ రాణీగారికి కళ్ల వెంట నెత్తురేకాని నీటి చుక్కకూడా లేదు.

ఇదంతా విని రాజుగారు జాలిపడి రాణిని చూడడానికి వచ్చాడు. అతడు రాణిని ఓదార్చవలెనని ప్రయత్నించాడు. కాని ఏమీ లాభంలేకపోయింది.

అంతలో ఈ వార్త తెలిసి మంత్రి తన భార్యను అందలమెక్కించి రాణివద్దకు తీసుకువచ్చాడు. అట్లాగే కోశాధిపతి తన భార్యతోను గాయకుడు అతని భార్యతోనూ వచ్చారు.

రాణి కింకా చెవులు వినబడుతూనే ఉన్నవి చేతులాడుతూనే ఉన్నవి. ఐతే కదలలేదు. మాట్లాడలేదు. చూడలేదు.

ఆవిడ పాపము, సావాసగత్తెలకు క్షమాపణ చెప్పాకుందా మనుకుంటుంది కాని నోటివెంట ఎక్కిళ్లు వస్తూ అ అ అ అనే స్వరంతప్ప మరేమీ మాట రావడంలేదు.—పోనీ, నోరున్నప్పుడే మంత్రి భార్యను పిలిపించి క్షమాపణ చెప్పకోకపోయిందీ!—

అట్లాగే సావాసగత్తెలను దగ్గరకు రమ్మని చేతులతో సంజ్ఞ చేసింది మంత్రి భార్యను గాయకుడి భార్యను చేటికలు రాణీదగ్గరకు తిసుకొనిపోయినారు. కోశాధికారి భార్య తానే వెళ్లింది. వాళ్ల ముగ్గురినీ

# ★ కర్పూరద్వీపయాత్ర ★

రాణి గట్టిగా కౌగిలించుకొని అ-అ-అ- అని ఒకటే గోలచేయసాగింది

—పోనీ, చేతులున్నవిగా! గంటం తీసుకొని పత్రంమీద మనస్సులో బాధ వ్రాసి వెళ్ళబుచ్చుకో రాదూ?—క్షమాపణ వ్రాసుకోరాదూ!—తోచలా!

సరిగ్గా ఆ కిందటిరోజున రాణి తన భర్తను వర ముడిగినవేళ అయింది. అంతవరకూ అ అ అ అని జపం చేస్తున్నట్లు అంటూఉన్న రాణికి ఒక పెద్ద ఓకిలింత వచ్చింది దానితో అ కు బిందునాదం కూడా కలిపి మూలుగుతూ రాణి ప్రాణాలు వదలింది.

రాణి పోయిన తర్వాత ఆమె సావానగత్తెలు ముగ్గురూ కూడా ఆ రాత్రే, మనస్సంతా రాణీ మీదనే పెట్టుకొని, ప్రాణాలు వదలిపెట్టారు.

తర్వాత రాజూ మంత్రీ కోశాధికారీ గాయకుడూ కూడా ఈలోకంలో ఎక్కువకాల ముండలేదు.

[ఇంకా ఉంది]

లంబాడి కుటుంబము —ఫోటో: లక్ష్మణ్, వరంగల్



# ఉదరశుద్ధి

భమిడిపాటి సోమయాజులు

సుబ్బారావు రూమ్‌లో కూర్చుని భోజనం కేరియరు కోసం ఎదురుచూస్తున్నాడు. హోటలువాడు యింకా కేరియరు ఎందుకు పంపడు? కొంపతీసి కేరియరు తెచ్చే ఆ 'బోయ్'కి ఏమన్నా వచ్చిందా?

పొద్దున్న తొమ్మిదిన్నరకి రావలసిన భోజనం! మధ్యాహ్నం ఒంటిగంటన్నరయింది! ఇంకా రాకపోవడ మేమిటి?

ఇవాళ పొద్దున్న కేరియరు వస్తుందిగదా అన్న దృష్టిలో పదిగంటలదాకా ఎదురుచూశాడు. పదింపావు అయింది. క్లాసు లున్నాయి. పాఠాలు మిస్ కావడానికి వీలు లేదు. ఏదో - ఏ కారణంవల్ల తేలేదోనని సమర్థించుకుని యింటిగలవాళ్లతో కేరియరు వస్తే వుంచమని చెప్పి వెళ్లాడు. కాలేజీనుంచి తిరిగిరాగానే వాళ్లు కేరియరు రాలేదన్నారు.

ఇదేమిటి? ఒంటిగంటన్నరయింది! యింకా భోజనం తేవకపోవడ మేమిటి?

అసలు సుబ్బారావు సహజంగా ఆకలికి ఉండలేడు. అతడు పొద్దున్నే భోజనం విలువకి కొంచెం అటూ యిటూగా టిఫిన్ వేసుకుంటాడు. తొమ్మిదిన్నరకి భోజనం ఉంటేగాని ఉండలేడు. మళ్లా మధ్యాహ్నం రెండు ప్లేట్లూ పడాల్సిందే. అలాటి ఆకలి, సుబ్బారావుది. భోజనం విషయంలో కూడా రేవనింగు లేదు కాబట్టి సరిపోయింది గాని లేకపోతే యిబ్బందే - హోటలుకుర్రాణ్ని కొంచెం లోబరచుకొని అన్నం గిన్నం ఎక్సెస్ వేయించుకుంటున్నాడు.

అమ్మయ్య! అడుగో, వచ్చాడు; 'కేరియర్ బోయ్!'

సుబ్బారావు కేరియర్‌లో ఉన్న అన్నం తినేస్తాడా, కేరియర్నే మింగేస్తాడా, లేక కేరియరు తెచ్చిన ఆ కుర్రాణ్నే కబళించేస్తాడా, అన్నట్టున్నాడు.

* * *

కుర్రాడు భోజనం తెచ్చేలోగానే కాళ్ళూ చేతులూ కడుక్కుని పీటా, నెయ్యిసీసా, ఆవకాయా పెట్టుకు కూర్చున్నాడు.

"ఏంరా? ఇంత ఆలస్యం, యివాళ? ఎవడికిరా అంత బుద్ధీ జ్ఞానం లేకపోయింది" ఒంటిగంటన్నరకిరా మీాలు తెచ్చేది?" అని ఎగిరిపడ్డాడు, భోజనం తెచ్చిన కుర్రాడిమీాద.

"అదేంటి బాబూ! రెండింటిగ్గదండీ, మీారు పంపమన్నారూ?" అన్నాడు కుర్రాడు.

"ఎవడ్రా చెప్పింది? రెండింటికి నేను మీాలు పంపమన్నానా?" అన్నాడు, ఆశ్చర్యాన్ని కోపంలో కలిపి.

"పొద్దున్నొచ్చి చెప్పారండీ!"

"ఎవరు? ఎవరు చెప్పార్రా?"

"ఎవరేమిటండీ ?- మీారు పంపినాయనేట- నాకేం తెలుస్తాది?"

ఇంక వాడిమీాదపడి లాభం లేదనుకుని, "ఏడ్చావులే!" అంటూ కేరియరు విప్పాడు. అతని ఆకలికి తగినట్టే ఉంది - గిన్నెలన్నీ ఖాళీ! కొంచెం చారూ అన్నం మట్టుకు వున్నాయి.

"ఇదేమిటీ! కొంచెం అన్నం, చారూనా? యివేంరా, యిట్లా పంపాడు, బుద్ధి లేదూ?"

నిజంగా సుబ్బారావుకి మతిపోయింది. పొద్దున్న టిఫిను తినలేదు - ఖాతా హోటలుకు శలవు; డబ్బులు లేవు - అందుచేత పొద్దున టిఫిను తినలేదు. ఇప్పుడు భోజనం చేదామా అంటే చారూ అన్నం పంపాడు!

తలుపులు తినే బావగారికి అప్పడాలు ఫలహారమూ అన్నసామితైంది.

* * *

'ఫలహారం' కానిచ్చి, హోటలుకి వెళ్లి, హోటలువాణ్ని ఈ దురాచారం గురించి అడుగుదామనుకున్నాడు, సుబ్బారావు. కాని అప్పటికే కొంచెం బలహీనత ప్రవేశించినట్టయింది. దీనికి తోడు మధ్యాహ్నం ప్రాక్టికలు. రెండు గంటలూ నిలబడాలి.

తిన్నగా కాలేజీకి వెళ్లాడు.

ప్రకాశం నవ్వుతూ "హలో! ఏమిటివ్వాళ, నీకు ప్రాక్టికలు?" అన్నాడు.

"సాల్వోయ్!" అన్నాడు, సుబ్బారావు నిరుత్సాహంగా.

"ఏం, అలా వున్నావు?"



తెలుపు, నలుపు.

—ఫొటో : పి. శివరామరాజు, మద్రాసు.

అలవాటు ప్రకారం రాత్రి హోటలుకి భోజనానికి వెళ్లాడు, సుబ్బారావు

“ఏమి సుబ్బారావుగారూ! విరేచనాలకి మందు పుచ్చుకున్నారటగా - ఎట్లా వుంది?” అని పలకరించాడు, హోటలువాడు

మళ్లా మధ్యాహ్నం వొచ్చినంత ఫోర్సూ వచ్చింది, సుబ్బారావుకి - “ఎవడు చెప్పాడూ?” నిలదీస్తున్నట్టు అడిగాడు

“ఎవరోనండీ - పొద్దున్నే వచ్చి చెప్పారండీ - ‘ఇవాళ సుబ్బారావుగారు విరేచనాలకి మందు పుచ్చుకున్నారు, పూర్తిగా భోజనం పంప వద్దు - చారూ అన్నం పంపమన్నారు’ అని చెప్పారండీ!”

పూర్తి కారణం తెలుసుకున్న తరవాత సుబ్బారావుకి ‘ఫోర్సు’ తగ్గిపోయింది పైగా అంత నీరసంలోనూ నవ్వు వచ్చింది - “రెండు గంటలకి పంపమనికూడా చెప్పారు కదూ?” అని అడిగాడు, చివరి సందేహాన్ని.

“అవునండి, మధ్యాహ్నం కాలేజీనుంచి మీరు వచ్చే వేళకి పంపమన్నారరండి!”

“అవును! బోధపడ్డాది. ఎవడో వెధవ, నన్ను ఏడిపించడానికి ఈ రోజు అలా చెప్పాడు. నేను విరేచనాలకి మందూ పుచ్చుకోలేదు - చారూ అన్నం పంపమని చెప్పాలేదు-” అంటూ తెంపేసి, టేబిల్ దగ్గరికి దారితీశాడు.

హోటలువాడు సానుభూతిగా, “అరె! అదేం సార్? నిజంగా కాదా?” అని అన్నాడు.

ప్రకాశం గుర్తుకొచ్చాడు, సుబ్బారావుకి!...

“ఏం లేదులే,” అని తప్పుకోబోయాడు, సుబ్బారావు.

ప్రకాశం నవ్వుతూ “భోంచేశావా లేదా, చేసినట్టు లేదే!” అన్నాడు. అత నెందుకో నవ్వు నాపుకుందుకు చాలా ప్రయత్నం చేస్తున్నాడు

అనమానం హెచ్చయి, “చేశా” అని తప్పుకున్నాడు, సుబ్బారావు.

ప్రకాశం అటు వేపు వెళ్లి రుమాలు నోటికడ్డంపెట్టుగుని నవ్వుకుంటున్నాడు.

“ఏంటోయ్?” అంటూ క్రిష్ణమూర్తి ప్రకాశందగ్గరికి చేరాడు. వాళ్లిద్దరూ ఏవేవో గుసగుసలాడేరు.

ప్రాక్టికలు అయ్యేలోగా చాలాసార్లు ప్రకాశం సుబ్బారావువేపు చూశాడు సుబ్బారావుకి ఎలాగో మంది.

# యోగాసనములు-దేహారోగ్యము

## 12. అభ్యాస నియమములు

ఆహార నియమములవలెనే యోగాంగాసనములు, ప్రాణాయామముల నభ్యసించువారు పాటించవలసిన నియమములను సంగ్రహముగా వ్రాయుచున్నాను

"ఆసనానిచ తావన్తి యావన్తో
జీవరాశయః' (ధ్యాన
బిందూప నిషత్)

అనగా జీవరాసు లెన్ని యున్నవో యోగాసనము లన్నియున్నవని పార్వతీ పరమశివుల సంవాదమందు చెప్పబడినది అట్లే ప్రతియొక్క యోగాసనములు అనేక విధములు శరీరారోగ్యమునకుగాని, రోగ నివ్వారణకుగాని యోగశాస్త్రమందు ఏదో యొక యోగాసనము విధింపబడినది వానిలో ఉదాహరణకు అందరకూ తెలిసిన పశ్చిమతానాసనమువిషయము గమనించవచ్చును ఈ ఆసనమున నభ్యసించవలసిన క్రమమును, ఫలమును హఠయోగ ప్రదీపికలో నిట్లు వివరింపబడినవి

"ప్రసార్య పాదౌ భువిదండరూపౌ
దోర్భ్యాం పదాగ్రద్వితయం
"గృహీత్వా జానూపరిన్యస్త లలాటదేశః
వసేదిదం పశ్చిమ తానమాహుః"
"ఇతిపశ్చిమతాన మాసనాగ్ర్యం
పవనం పశ్చిమవాహినం కరోతి
ఉదయాం జఠరానలస్య పుంసాం
ఉదరే కార్శ్యమరోగి తాంచ
నిత్యం"

ఇట్లని స్వాత్మారామ యోగీంద్రులు వివరించిరి వీని యర్థము మొదటి వ్యాసములలో వివరింపబడినది

పశ్చిమ తనాభ్యాసము చేయువారిలో కొందరికి మాత్రమే రెండవ శ్లోకములో చెప్పబడిన ఉదరరోగములు నివారణ కావచ్చును, కొందరికి కాకపోవచ్చును కారణమేమనగా—లోకమందు అందరి శరీరము లొకే విధము నుండవుగదా! కొందరు స్థూలకాయులు మరికొందరు కృశశరీరులు, ఇంక కొందరు వక్రకాయు లుందురు. పైన చెప్పబడిన అభ్యాసక్రమము అందరికిని యోగ్యము కాకపోవచ్చునని కొందరు మహర్షులు విమర్శించి, ఆ పశ్చిమతానాసనమునే అర్ధపద్మ పశ్చిమతానాసనము, తిర్యఙ్ముఖైక పశ్చిమతానాసనము, పరివృత్త పశ్చిమతానాసనము, విపరీత పశ్చిమతానాసనము, ఊర్ధ్వముఖ పశ్చిమతానాసనము అని విభజించి వారివారి శరీర పరిస్థితులనుబట్టి వీని నభ్యసించవలెనని చెప్పిరి.

ఇదేరీతిగా సర్వాంగాసనమును సాలంబ సర్వాంగాసనము, నిరాలంబ సర్వాంగాసనము, ఏకపాద సర్వాంగాసనము, పార్శ్వపాద సర్వాంగాసనము, ఇత్యాదిగా విభజించిరి మయూరాసనము అధోముఖము, పంగుమయూరము, ఉత్థాన మయూరము, ఏకపాదము, ద్విపాదము అని విభజించబడినది.

శీర్షాసనము, నిరాలంబము, సాలంబము, ప్రసారిత హస్తము, సంకుచిత హస్తము, ధరాసక్తము అని విభజించబడినది.

పద్మాసనము —బద్ధ పద్మాసనము, అధోముఖ పద్మాసనము, ఊర్ధ్వముఖపద్మ



ఉత్కటాసనం

# యోగాసనములు

సనము, విపరీత పద్మాసనము అని అనేక ప్రకారములుగ విభజింపబడినవి.

ఒక క్రమమున అభ్యసించిన పిమ్మట ఫలించకపోయినచో మరొక క్రమము నభ్యసించుచూ శరీరానుగుణమైన ఫలమును శాస్త్రీయముగ పొందుటకుగాను ఈ విభజన చేయబడినది.

శరీరము, దేశము, ఆహారము, రోగము, వాతావరణములను బట్టి అభ్యాసవిధానము నిర్ణయింపవలెను.

ఈ రహస్యములను సమగ్రముగ గ్రహింపక, ఇచ్చవచ్చినట్లు యోగాంగాసనములను చేయుచుండుటవలననే కొందరికి యోగాభ్యాసము అపాయకరమను అపోహకు అవకాశము గలిగినది. మనవారిలో ననేకులు మూలశాస్త్రములను గురుముఖమున నభ్యసింపక స్వేచ్ఛాప్రచారము చేయుచుండుట శోచనీయము.

యోగాంగాసనమువలెనే ప్రాణాయామములును ఎన్నియో విభాగములుగా విస్తరించినవి. మొట్టమొదట 1. సూర్యభేదనము, 2. ఉజ్జాయీ, 3. సీత్కారీ, 4. శీతలీ, 5. నాడీశోధనీ, 6. భస్త్రికా, 7. కపాలభాతి, 8. భ్రామరీ, 9. ప్లావనీ, 10. మూర్ఛా అని పదివిధములేగాని తరువాత సమవృత్తి, విషమవృత్తి, అన్తః కుంభక, బాహ్య కుంభక, అనులోమ, విలోమ, ప్రతిలోమములను అంతర్విభాగములచే పలువిధములైనవి.

సాధకులు తాము గోరు ఫలమును ప్రాణాయామమునందలి ఒక విధానముచేగాక పోయిన మరొక విధానముచేనైన బొందవచ్చునని మన ప్రాచీనులిన్ని విభాగములను కనిపెట్టియున్నారు. కొందరు సమంత్రముగ మరికొందరు మంత్రములు లేకుండ అభ్యాసము చేసినారు. వేల సంవత్సర



వీరభద్రాసనం



లకు పూర్వము మనవారు సకల కర్మలను సమంత్రకముగా ననుష్ఠించుచుండిరి. రాను రాను తురుష్కులచేతను హూణులచేతను చెప్పరాని బాధ లనుభవించి కొందర ట్టి యనుష్ఠానమును విడచిరి, మరికొందరు మరచిరి.

యోగాంగాభ్యాసులు తామభ్యసించు ప్రతియొక్క సాధనకు సరహస్యముగ, సాంగముగ తెలుసుకొని సకాలములో నియమములను సక్రమముగ ననుసరించినచో ఈ సాధనవలన ఎట్టి అపాయములును సంభవింపవు. కాని, వేదాధ్యయన సంపన్నుడు, సర్వకర్మ సమారాధ్యుడు సర్వాన్తర్యామియైన పరమాత్మపట్ల భక్తి పరతంత్రుడు అయిన గురువులవలన సాధన విధానమును తెలుసుకొనవలెనను యంశమును పాఠకులు మరువరాదు.



విపరీత యోగముద్ర

అధోముఖ పద్మాసనం





హనుమాసనము



ఊర్ధ్వ పద్మాసనం



# కాలక్షేపం



(5-వ. పేజీ తరువాయి)

ఈ కాలుడే, మన రోజులు మనం లెక్కపెట్టుకొనేటట్లు చేస్తున్నాడు. "ప్రొద్దు పొడిచింది" అంటే సూర్యుడుదయించాడని అర్థం. "ప్రొద్దు గడువడు" అంటే కాలము గడువడు అని అర్థం ఈ విధంగా సూర్యుడే మనకు దేవుడిచ్చిన గడియారం దీనినిగూర్చి ధ్యానంచేసిన కాలది, మన జాతి కాలు మనం చూచుకొన్న కాలది మన ఆయుష్కాలం మనం లెక్కించుకొనడమవుతుంది అది మనలను గజగజ లాడించే గడియారమవుతుంది. గడియారం జేబులో ఉంటే చాలదు ముంజేతి కడియముకలె కండ్లకు కట్టినట్లుగా, మెడలోని లింగకాయవలె గంటలు నిమిషాలు నిత్యం ప్రత్యక్షమవుతూండడం మనకు శోభస్కరమా? శ్రేయస్కరమా? పోస్టు టైమ్ అవుతోందని ఆతురత-రైలు టైమ్ అవుతోందని తత్తరపాటు- మంగలి షాపు తెరచే టైముకు ముందుగా వెళ్ళాలనే కంగారు-(లేకపోతే, కత్తి చేతబట్టి క్యూలో నిలబెట్టి మన విలువగల కాలం ముందుగా తువరం చేస్తాడు)—సినిమాకు వెళ్లే టైము అయిందనే గుండె దడ ఈ గుండె దడలతో గుండెలు బలహీనమై గుండెలలోనే రైళ్లు పరుగెత్తుతాయి గుండెలలో సదా "బ్రతుకుటకై వీలు లేదు వసుధను సుమతీ" అని అర్జంటు టెలిగ్రాములు కొట్టుతున్నట్లుగా గుండె కొట్టుకొంటూ ఉంటుంది పోనీ, ఈ గుండె జబ్బుకు మందు తెచ్చుకుందామాఅంటే, డాక్టరుఆయనఇంటి నుంచి వెళ్ళిపోయే టైము అయిందనే గుండె దడమూలంగా మన కాలము మరింతసన్నిహితమవుతూ ఉంటుంది సూర్యుణ్ణి చూచి శుభముహూర్తాలు పెట్టుకోవచ్చు సూర్యదర్శనం కాకపోతే, ఆనాడు దుర్దినంగానే భావించవచ్చు—కాని, గడియారాన్ని చేతికి, మూతికి, కాలికి, మెడకు కట్టుకొని, నిమిషాలు లెక్కపెట్టుకుంటూ, ప్రతినిమిషమూ, "హా పోయెనయ్యో ననుబాసి!" అనే విరహతాపంతో అహోరాత్రాలు కాలం గడుపుతూ ఉండడంవల్ల, ఆత్మకు శాంతిమూ లేదు - మనస్సుకు సౌఖ్యమూ లేదు - కీ యిచ్చినంత సేపుమాత్రమే తిరిగే గడియారపు జీవితంవంటిదే మానవ జీవితం అవుతుంది కాలప్రభావానికి ఎదురీద గల మహాపురుషులు, కాలచక్రాన్ని, యుగధర్మాన్నీ, శాసించి త్రిప్ప గల, మహా తపస్సంపన్నులు, గడియారాలు దగ్గర పెట్టుకొని తపస్సు చేయలేదు తమలో ఉన్న తమస్సు పోయేవరకు తపస్సు చేశారుగాని, బయట చీకటిపోయి పగటివెలుగు వచ్చినదా అని వారు దిక్కులు నిక్కి చూడలేదు. సూర్యుణ్ణికూడా లెక్క చేయలేదు. అర్ఘ్యం యివ్వడానికి కూడా యోగనిద్రలోనుంచి ఆత్మ జిజ్ఞాసువు కన్ను తెరచి మిన్నువంక చూడలేదు.

కాని, కాలం మారిపోయింది కాలం విలువ హెచ్చింది కాని, కాలంతో పరుగెత్తవలెననే మానవుల విలువ తగ్గింది టపా టైము రైలు టైము గాచుకొని సదా గుండె దడతో పరుగెత్తి పాలుత్రాగడి గంట గంటకూ తేనీరు త్రాగడి తేనెటీగలు— యీనాటి టపాపన్నులు, యీనాటి వ్యవహార వ్యాపార సంపన్నులు. తపస్సంపన్నులు ఆనాటివారు

ఉపనిషత్తుల పరబ్రహ్మ శాస్త్రిగారికి గడియారాలంటే తలనొప్పి. బ్రహ్మానందంగా భగవద్ధ్యానం చేసికొనే సమయంలో ప్రక్కయింటి గోడగడియారం పదిగంటలు కొట్టనా, పండ్రెండు గంటలు కొట్టినా ఆయన లెక్కించేవాడు కాడు ఆయన పారాయణం అంతా అయితేనేగాని ఆయనకు ఆకలి అయ్యేదికాదు ఆకలి అయితేనే గాని అన్నము తినుటకు హాజరయ్యేవాడు కాదు. ఆయనకు ఉపనిషత్తులన్నీ పరబత్తులు లాగున ఉండేవి వాటి భాష్యంతో వ్యాఖ్యానాల సారంతో ఆయన శరీరం అంతా ఆపాదమస్తకం నిండిపోయింది అటువంటి మహా విద్వాంసుడు ఉపనిషత్తుల గూర్చి ప్రసంగిస్తూఉంటే విని ఆనందించ గల్గినవానిది కూడా అఖండజాతకమే వేదాచలం అనే ఊరికి మిస్టర్ జాన్‌బుల్ అనే ఒక ఆంగ్లేయుడు కలెక్టరుగా వచ్చాడు. ఆయనకు సంస్కృతంలో చాలావరకు ప్రవేశం ఉంది. కాని, ధారాళంగా స్పష్టంగా స్వచ్ఛంగా సంస్కృతం మాట్లాడలేడు ఆయనకు మన వేదాంత విషయములను తెలిసికోవలెననే కుతూహలం ఎక్కువగా ఏర్పడింది ఉపనిషత్తుల పరబ్రహ్మశాస్త్రిగారు గొప్ప విద్వాంసులని విన్నాడు ఆయనను పిలిపించి మరొక మధ్యవర్తిద్వారా మాట్లాడించి ఒక ఏర్పాటుకు ఆయనను ఒప్పించాడు ఆ వేదాచలంలో జాన్‌బుల్‌గారు పదిహేనుదినములవరకు ట్రావెలర్సు బంగాళాలో మకాము చేసియుంటారనిన్నీ, ప్రతి ఉదయము 9 గంటలకువచ్చి 10 గంటలవరకూ ఒక గంటసేపు కలెక్టరుగారికి వేదాంత గోష్ఠి జరుపుటకు వీలు ఉంటుందనిన్నీ, ఆ వేళకు సరిగా ఆయనవచ్చి సంస్కృతంలో విషయాలన్నీ సావకాశంగా ప్రసంగిస్తూ ఉంటే కలెక్టరుగారికి కావలసిన విషయాలన్నీ వ్రాసికోగలరనిన్నీ, అందు నిమిత్తమై పారితోషికంగా పరబ్రహ్మశాస్త్రిగారికి నూట పదహార్లు యివ్వబడుననిన్నీ ఒక ఒడంబడిక చేసికొనడమైంది. వరుసగా రెండు మూడు రోజులు పరబ్రహ్మశాస్త్రిగారు వచ్చి దొరగారికి దూరంగా కూర్చుండి, తన కడుపులో ఉన్న వేదాంత సారమును అపార పారావారముగా ఉపన్యసించడం సాగించారు. నాలుగోరోజున శాస్త్రిగారు సకాలంలో గోష్ఠికి రాలేదు జాన్‌బుల్‌గారు ఆయనకోసం ఎదురుచూస్తున్నారు. కొంత సేపటికి ఉపనిషత్తుల పరబ్రహ్మ శాస్త్రిగారు విచ్చేశారు

అప్పటికి దొరగారి రిస్టువాచిలో ఉదయంతొమ్మిదిన్నర అయింది. శాస్త్రిలుగారు అరగంట ఆలస్యంగా వచ్చారు. శాస్త్రిగారు రాగానే దొరగారు చికాకుపడుతూ తన షర్టుచేతులు పైకిలాగి పిడికిలి బిగించి తన ముంజేతిని శాస్త్రిగారి వైపుకుచాచి కళ్లు పెద్దవిచేసి పెదవిబిగించి కొంచెం ఇంచుమించుగా వీరాంజనేయం లాగున ఆయనవంక చూచారు పిడికిలి బిగించి ముంజేతిని శాస్త్రిగారివైపు చాచేసరికి, శాస్త్రిగారు తన గౌరవం దక్కదని నిశ్చయం చేసుకున్నారు. వెంటనే వెనుకకు మరలి సింహద్వారందాటి "లక్ష్మీనృసింహా మమ దేహి కరావలంబం" అని లక్ష్మీనృసింహస్తోత్రం పఠించుకుంటూ పలాయనమైనారు శాస్త్రిగారింటికి జాన్‌బుల్ కబురు చేశాడు "గురుభావం, గౌరవభావం లేకుండా రవ్వంత ఆలస్యంగా వచ్చినందుకు పిడికిలి బిగించి ముష్టియుద్ధంచేస్తాననే ముష్టి శిష్యుడు నాకెందుకు?" అని శాస్త్రిగారు దొరగారి జవానుకు ద్వారంవద్ద నెజవాబుచెప్పి పంపించారు. కాని, జాన్‌బుల్ తన రిస్టువాచిలోని టైమునుచూడవలసినదిగా శాస్త్రిగారిని కోరుతూ పిడికిలి బిగించి తన ముంజేతి ముందుకు చాచినాననిన్నీ, ఆయనను గు టకు చెయ్యి చాపలేదనిన్నీ వెయ్యివిధా వివరించి చెప్పినప్పటికీ, "నాముందు అతిగాశిష్యదొర రిస్టుగడియారం చూపించడ నాబోటి శిష్టులు సహింపదగినది కాదని పరబ్రహ్మశాస్త్రిగారు వాదించారు టైము చూపించి నిమిషాలు లెక్కించేమనిషితో నాకు ఒక్కసెకండయినా పొత్తు కలియదన్నారు. అటువంటివాడు నావంటివానికి మిత్రుడుకాడు అమిత్రుడుఅన్నాడు. అటువంటిసందర్భంలో ఉపనిషత్తుల పరబ్రహ్మశాస్త్రిగారు "శత్రుకృత తిరస్కార మెట్లు సహింప నేర్తు"



# చక్కిలిగింతల "చక్రపాణి"

చిత్రం పేరు : చక్రపాణి.
నిర్మాతలు : భరణీ.
నిర్మాణం, దర్శకత్వం, కూర్పు : రామకృష్ణ.
కథ, పాటలు, మాటలు రావూరు.
సంగీతం భానుమతి
ఛాయాగ్రహణం శెల్వరాజ్
శబ్దగ్రహణం . కోటేశ్వరరావు
నటీనటులు భానుమతి (బటానీలుకూడ)
టి జి కమలాదేవి (భాగవతం పుస్తకంతో సహా)
లీలాకుమారి (హార్మోనియం, హిస్టీరియాకలిపి)
ఛాయాదేవి (కర్మఫలానుభవంతో సహా)
సూర్యకాంతం (సగంచాలు)
నాగేశ్వరరావు, (షేవింగ్ సెట్టు సహాయకారిగా)
సి ఎస్ ఆర్ (ఇనపపెట్టెకు అండగా)
వంగర (సి ఎస్ ఆర్ కి దండగా)
డా॥ శివరామకృష్ణయ్య (ఆమ్రేటు)
రమణారెడ్డి (ఎండు కొబ్బరి కాయలతో సహా)
పొడుగు మూడుగంటలు.

ఇనపపెట్టె 'కథానాయకుడు'గా గల భరణీవారి తెలుగు సాంఘిక చిత్రం "చక్రపాణి" యీ మధ్యనే ఆంధ్రదేశంలో విడుదలయింది ఈ ప్రధానపాత్రకు సహాయ నటులుగా సి. ఎస్ ఆర్, వంగర వెంకట సుబ్బయ్యగార్లు నటించారు. వారికి సంబంధించిన వ్యక్తులుగా భానుమతి, కమలాదేవి, లీలాకుమారి, వెంకుమాంబ, కంచి నరసింహారావుగార్లు,(కథ నడిచినకొద్దీ) వీరితో అనుబంధించే వ్యక్తులుగా నాగేశ్వరరావు, రమణారెడ్డి, అమరనాథ వగైరా వగైరా నటించారు.

ఈచిత్రంలోని కథావస్తువు సూక్ష్మంగా యిది —అనగనగా ఒక వూరు ఆ వూళ్లో ఒక యిల్లు ఆ యింట్లో ఒక యినపపెట్టె ఆ యినపపెట్టె తాలూకు సంరక్షకుడు చక్రపాణి. ఆయనకి ఎంతసేపూ యీ యినపపెట్టెలోకి నాలుగు 'రాళ్లు' వేస్తూ వుండటమూ, వేసిన 'రాళ్లు' ఎగిరిపోకుండా కాపలా కాయటమే పని. ఆయన ఆపనిలో పడి కొట్టుకొంటుంటే ఆయన మనమడు, మనమరాళ్లూ ఆయన తమకేదో లోపం చేశాడని ఆడిపోసుకొని ఎవరి దారిని వారు వెళ్లిపోతారు. ఈలోగా ఆ యింట్లో ఒక చావు, ఒకటిన్నర పెళ్ళి జరుగుతాయి కొంపలో ఎన్ని జరిగితేనేం – సాక్షాత్తూ లక్ష్మీదేవికి ప్రత్యక్ష చిహ్నంగా యీ భూమిమీద, అందునా తన యింట వెలసిన యినపపెట్టెగారి ఆరోగ్యం దినదిన ప్రవర్ధమానమౌతుంటే చక్రపాణిగారికి అంతే చాలు కథ ఒక దశకి ఒచ్చేసరికి చక్రపాణిగారికి తను తాను బ్రతికినంతకాలం మోసిన ఆ బాధ్యతను తన తదనంతరం ఎవరు స్వీకరించగలరా అనే దిగులు పట్టుకొంటుంది (చక్రపాణిగారి కడుపున పుట్టిన కొడుకు 'మన కెంగుకొచ్చింది గొడవ' అని సినిమా మొదలుపెట్టకముందే చచ్చిపోతాడు) తన మనమరాళ్లలో ఎవరు ముందుగా కొడుకునికంటే వారికి యీ బాధ్యతను అప్పగించి తాను తప్పుకుంటానంటాడు తాతగారికి త్వరగా మోక్షం యిప్పించే సద్బుద్ధి కలవారై, ఆయన మనమరాళ్లు కొడుకుని కనాలని తెగ తొందరపడతారు పెద్ద మనమరాలు కొడుకుని కనబోయి పొరపాటున కూతురుని కనేస్తుంది దాంతో ఆవిడా, ఆవిడ భర్త తాతగారికి చేయదలచుకొన్న సహాయం చేయలేకుండా పోతారు రెండో మనుమరాలు గర్భవతి కాకుండానే, నొప్పులు పడకుండానే ఆస్తికి వారసుడు కాగలిగిన కొడుకుని కనబోయి, కోరి తెచ్చుకొన్న కొంటె మొగుణ్ణి వంటవాణ్ణిగా తయారుచేసి, పక్కవాటా పంతులమ్మ తమ్ముణ్ణి అద్దెమొగుడుగా తయారుచేసుకొని మిడకబోతుంది కాని ఆవిడ వేసిన ప్లానుఅంతా అడ్డంతిరిగి, అసలు మొగుడు నైల్లోపడే పరిస్థితీ, అద్దెమొగుడే తప్పనిసరి మొగుడయ్యే పరిస్థితీ ఏర్పడుతుంది దాంతో ఆవిడ తన ఓటమి ఒప్పుకొని ఆ స్కీకి స్వస్తి చెపుతుంది అంతటితో కథ ఆగిపోతే కథానాయకుడి పరిస్థితి గగ్గోలుగా తయారయ్యేదే—చక్రపాణిగారి మనమడు (కొడుకు కొడుకు) సినిమా మొదలు పెట్టిన కాస్సేపటికే కొంపలోనుంచి లేచిపోయి, చివరిదాకా అక్కడా అక్కడా తిరిగి, చివరి ఘట్టంలో కోటు తొడుక్కొని కొడుకుతో ప్రవేశించకపోతే! మనుమరాలి కొడుకు అనుకొన్న పసివాడు తీరా చూస్తే మనమడి కొడుకైనాడు అటునుంచి యిటు వచ్చినా యిటునుంచి పోయినా, ఆ పసివాడు తనకి మునిమనుమడే అవుతాడు కాబట్టి పెద్ద చక్రపాణిగారు యినుపపెట్టె సంరక్షణభారాన్ని ఆ చిన్న చక్రపాణికే(కొడుకు కొడుక్కి కొడుకు) అప్పగిస్తారు చిన్న చక్రపాణిగారు చిన్నవాడు కాబట్టి చుట్టూవున్న నలుగురూ కలిసి ఆ 'భారాన్ని' తలా కాస్తా పంచుకొంటారు —జైహింద్!

ఈ చిత్రంలో వచ్చే పాత్రలందరూ బహుశా పత్రికల్లో పడే నవ్వులూ - పువ్వులూ విరివిగా చదివి వుంటారు; ఎవరిని చూసినా చమక్కారాలు వెదజల్లుతుంటారు పాత్రలని సృష్టించినవారికీ, వారిచేత సంభాషణలు పలికించినవారికీ, 'ఎక్స్‌లు మార్చవలసిన అవసరం' చాలా వున్నట్లు కనిపిస్తున్నది ఈ పాత్రలన్నింటిలోనూ, తెగిని కేటలగా తెలివితక్కువతనమూ రెండూ ఒక్క మాలతికి మాత్రమే అంకితమైపోవటం మరీ ఆశ్చర్యంగా వుంది ప్రేక్షకుల్ని మొదటినుంచి చివరివరకూ నవ్వించటమే పనిగా పెట్టుకొన్న యీ చిత్రనిర్మాతలు, అప్పుడే పిచ్చాసుపత్రి నుంచి వదిలిపెట్టబడిన వ్యక్తుల ధోరణిలో వ్యవహరించే డజను పాత్రలకు తెరమీద కుమ్మరించి, తద్వారా కావలసినంత హాస్యాన్ని పుట్టించాలని వారి ఆశయం అంతమటుకు నెరవేరింది చిత్రాన్ని చూస్తున్నంతసేపు లెక్కలేనన్ని సార్లు నవ్వి

అవిందావారి "మేలుకొలుపు"లో జమున.

# చక్కిలిగింతలు
## ★ "చక్రపాణి" ★

నప్పటకీ, ప్రేక్షకుడు, తదనంతరం జ్ఞాపకం పెట్టుకొనేది ఏమీ కొన్ని వృత్తపదాలు, వాలి చేష్టలుతప్ప మరేమీ లేవు

పూర్తిగా ప్రహసనం ఫక్కీలో నడిచిన యీ చిత్రంలో పాటలు అనవసరం అనిపిస్తున్నాయి ఉన్న ఆరు పాటల్లోనూ రెండు పూర్తిగా కర్ణాటక సంగీత భక్తిపాటలే కావడంమూలంగా, కేస్కార్ గారు రేడియో ద్వారా ప్రపంచానికి చేయ తలపెట్టిన మరమ్మత్తు కొంతలో కొంతగా అయినా పని చేస్తోందనే భావం కలుగుతోంది అదికాక ఎంత కర్ణాటక సంగీతమైనా, భానుమతి పాడుతుంటే హాయిగావుంది

—గుంటూరు గ్రామ
కాపురస్థుడు.



నూర్స్ ఎండ్ మూవీస్‌వారి "బాద్ షాహ్"లో ఉషాకిరణ్. విక్టర్ హ్యూగో ప్రసిద్ధ నవల హంచ్ బాక్ ఆఫ్ నాటర్ డామ్ ఆధారంగా తీయబడిన ఈ చిత్రం త్వరలో విడుదలౌతున్నది.

బి. ఏ. సుబ్బారావుగారు తీస్తున్న "రాజు-పేద"లో సుధాకర్.

## మంచి చిత్రాలకు ప్రభుత్వ సన్మానం

భారతదేశంలో ఉత్తమ చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించడానికిగాను భారత ప్రభుత్వం ఏటేటా అవార్డులివ్వాలని నిశ్చయించింది. సినీకళా ప్రాశస్త్యం, టెక్నిక్ అభివృద్ధి, విజ్ఞానం, జాతీయ సంస్కృతీ వికాసం మొదలైన అంశాలనుబట్టి అవార్డులివ్వబడతాయి. ఇటువంటి ప్రోత్సాహం ఇవ్వాలని ఫిల్మ్ ఇంక్వైరీ కమిటీ ఇదివరలో సూచించింది. ఇవిగాక ప్రత్యేకం పిల్లల చిత్రాలకు, డాక్యుమెంటరీ చిత్రాలకు అవార్డులిస్తారు.

ఉత్తమ చిత్రానికొకటి, పిల్లల చిత్రాలలో మంచిదానికొకటి, డాక్యుమెంటరీలలో మంచిదానికొకటి మూడు అవార్డు



నేషనల్ ఆర్ట్ వారి "తోడుదొంగలు"లో నృత్యసన్నివేశం

## మంచి చిత్రాలకు ప్రభుత్వ సమ్మానం

ఉంటాయి. భారతదేశమంతటా అన్ని భాషలలో ఉత్తమ చిత్రానికిచ్చే అవార్డు కాక వివిధ ప్రాంతాల తయారైన చిత్రాలలో ఒక్కొక్కటి చొప్పున అవార్డులివ్వబడతాయి (అంటే దక్షిణాదికి తెలుగు తమిళ భాషలలో చెరికొక మంచి చిత్రానికన్నమాట)

ఈ అవార్డులకు పోటీ చేయాలనుకొనే నిర్మాతలు ఫిల్మ సెన్సార్ రీజనల్ ఆఫీసర్ కి దరఖాస్తు పెట్టుకోవలసి ఉంటుంది అవార్డులు 1 కథా సంవిధానం కథా నిర్వహణకి 2 డైరెక్షన్ కి 3 అభినయానికి 4 ఫొటోగ్రఫీ, సౌండ్ రికార్డింగ్ కి 5 సంగీతానికి ఇవ్వబడతాయి

* * *

## రష్యాలో భారతీయ కథా చిత్రం

మనదేశంలో ప్రచారంలో ఉన్న ఒక పుక్కిటి కథ తీసుకుని రష్యాలో పిల్లల కోసం కార్టూన్ చిత్రం నిర్మిస్తున్నారని టాస్ వార్తాసంస్థ ప్రకటించింది కథ పేరు 'బంగారు లేడి'

విదేశాల జానపద గాథలు తీసుకుని మాస్కో స్టూడియోస్ లో రష్యన్ బాల బాలికలకోసం విరివిగా కార్టూన్ చిత్రాలు నిర్మించబడుతున్నాయి. ఇంతవరకూ చీనీ, కొరియన్ కథలు తియ్యబడినాయి. సౌఖ్య సాధనకై మానవుని కృషి, జంతుజాలంపట్ల భారతీయుల సఖ్యభావం 'బంగారు లేడి' అనే చిత్రంలో ప్రధానాంశాలు ఈ చిత్రంలో భారతీయ శిల్పకళావైభవం నైసర్గిక సౌందర్యం ప్రతిబింబింప చెయ్యాలని నిర్మాతలు కృషిచేస్తున్నారట ఇందులో కొన్ని భారతీయ జానపద గీతాలు కూడా ఉంటాయి

* * *

## 1953 'ఆస్కార్' బహుమతులు

1958 లో నిర్మించబడిన హాలీవుడ్ చిత్రాలలో "ఫ్రమ్ హియర్ టు ఇటర్నిటీ" (*From Here To Eternity*) ఎనిమిది ఎకాడెమీ అవార్డులు గెలిచింది ఈ చిత్రానికి కథ వ్రాసిన రచయిత, డైరెక్టరూ ఆస్కార్ బహుమతులు గెల్చారు.

# ★ పాఠకుల అభిప్రాయాలు ★

### వాహినీవారి 'పెద్దమనుషులు'

లోకానికి పెద్దమనుష్యులమని నిరూపించుకుంటూ లోపల కుట్రలు చేయుచూ పరువుగా బ్రతికేవారిని గురించినది చిత్రం.

కథ చాలా రసవత్తరంగా నడిచింది. పెద్దమనుష్యులమని చెప్పి మోసాలు చేసే వారికి నీతిమార్గం గూపెట్టుతుంది. ముఖ్యంగా పంచాయితీబోర్డు ప్రెసిడెంటులు, మున్సిపల్ చైర్మనులు, మెంబర్లు తప్పకుండా చూడవలసిన చిత్రం. అక్కడక్కడ లోపాలున్నా సరిచేసుకున్నారు యాక్టర్సు 'బావా, మరదలు' వీధి నృత్యం, 'నాన్నా పులి' నృత్యనాటిక, శంకరం పార్టీ భజనపాటలు బాగున్నాయి బాక్ గ్రౌండ్ సంగీతం బాగున్నది. ఇట్లాంటి చిత్రముతీసిన కె వి. రెడ్డిగారికి సాహృదయ పూర్వక నమస్కారములు.

—యస్. సిహెచ్. ఆంజనేయులు.

* * *

---

పారమౌంట్ వారి చిత్రం "రోమన్ హాలీడే"లో నాయిక పాత్ర ధరించిన ఆడ్రే హెప్ బర్న్ ఉత్తమ నటిగా, 'స్టలాగ్ 17' అనే చిత్రంలో నాయక పాత్ర ధరించిన విలియమ్ హోల్డెన్ ఉత్తమ నటుడుగా ఆస్కార్ బహుమతులు గెల్చారు. "ఫ్రమ్ హియర్ టు ఇటర్నిటీ"లో ద్వితీయ పాత్రలు ధరించిన డోనారీడ్, ఫ్రాంక్ సినాత్రా బహుమతులు పొందారు చక్కని కలర్ ఫొటోగ్రఫీకి పారమౌంట్ వారి 'షేన్' చిత్రాన్ని తీసిన కెమెరామన్ కి బహుమతి ఇవ్వబడింది

* * *

## సినిమా టిక్కెట్టు అణా!

ఫిల్మ మార్కెట్ బొత్తిగా మందగించినందువల్ల షోలాపూర్ లో ఒక అప్-టు-డేట్ థియేటర్ లో సినిమా ఆఖరి టికెట్ రేటు 5 అణాలనించి ఒక అణాకి తగ్గించారట! ఇప్పటికే రెండు డేరా సినిమాల్లో రేట్లు తగ్గించబడ్డాయి.

అణావరకు కాకపోయినా మన సినిమా థియేటర్లలో రేట్లు సగానికైనా తగ్గించడం మంచిదనిపిస్తుంది. 1954 లో విడుదలైనవాటిలో శతదినోత్సవాలు చేసుకోవలసిన చిత్రాలు కూడా ముందే తర్లిపోవలసి వస్తున్నదంటే కారణం ప్రజలకి కొంత కొనుగోలుశక్తి తగ్గడమే. కాబట్టి డబుల్ ఎట్రాక్షన్ అంటూ లవకుశలూ కృష్ణలీలలూ జోడించే బదులు థియేటర్లు రేట్లు తగ్గించుకోడం మంచిదేమో!

★

## తూకంలో 'పెద్దమనుషులు' 'అంతా మనవాళ్లే.'

మూడేళ్ళనుంచీ మురిపించిన వాహినీవారి "పెద్ద మనుషులు" ఈమధ్యనే విడుదలయింది. మూడు నెలల క్రితం సారధీవారి "అంతా మనవాళ్ళే" విడుదల కాకపోతే "పెద్ద మనుషులు" ప్రేక్షకులో కాన్ని మరింత రంజింపజేసి యుండేది. అయితే సామాన్య సాంఘిక చిత్రాలకంటె ఎక్కువ స్థాయిలో ఉన్నమాట నిజం. కాని "అంతా మనవాళ్ళే"ని చూసిన ప్రేక్షకుల్ని "పెద్దమనుషులు" ఆకర్షించలేదేమో!

రెండు చిత్రాలూ సంఘంలోని పేరు పురుగుల్ని వెలెత్తి చూపడంకోసమే కృషి చేశాయి. అయితే, తరవాత చిత్రంలో కథ అంత పటిష్టంగా లేకపోయింది.

"అంతా మనవాళ్లే"లో విలన్ నాటికి నూరుపాళ్ళూ విలనే ఎత్తుపై ఎత్తు వయ్యాటంలో అందెవేసిన చెయ్యి. "వెలది, జూదంబు, వేట, పానంబు' అనునట్లు చాలా దుర్మార్గపు లక్షణాలు జగన్నాధంలో కనిపిస్తాయి మామగా రిచ్చిన డబ్బంతా ఖర్చుపెట్టి, ఆపైన ఆయనను పరారీకమ్మని ప్రోత్సహిస్తాడు. కోపరేటివ్ స్టోర్సు ప్రెసిడెంటుగా మురానాయకుడై మూగప్రజానీకాన్ని మోసగించి డబ్బుకాజేస్తాడు స్టోర్సునంతా స్వంతానికే వాడుకుంటారు, మురావాళ్లు మరణశయ్యపైనున్న భార్యచేత వీలునామా పై వేలుముద్ర వేయించగలిగిన ఘనుడు. ఇక చిదంబరంలో మనం, హాస్యాన్ని మోసాన్ని గూడ చూడగలం. కూతురుపై ప్రేమకొద్దీ అల్లుడి

టోపీలో పడి వూళ్లో వాళ్లందరికీ "శెట్బే" అంటాడు. కాషాయిగుడ్డలు కట్టి "భిక్షులు లక్షులు" రాబట్టుకొంటాడు

నిజాన్ని నడిబజారులో వేసే "కాగడా" పత్రికా సంపాదకుడు మొదటినుంచీ, మోసగాళ్ళ మురాకు, కోరకబడని కొయ్యగానే మసలుతూ వచ్చాడు కథానాయకుడైన సత్యం నిశ్చితాభిప్రాయాలుగలవాడు, యువకుడు, ఆదర్శాలకోసం పట్టు పట్టేవాడు. మనుషుల ప్రాణాలతో చెరలాటలాడే బ్లాకు మార్కెటు మందుల వ్యాపారం, అతనికి నిజంగా పిచ్చెక్కేటట్టు చేస్తుంది ఈ కుట్రంతా బయటపెట్టడంలో "కాగడా" సంపాదకునికి సహాయపడతాడు. చివరికి మురావాళ్ళంతా పట్టుబడి ప్రభుత్వంచేత శిక్షింపబడతారు.

"పెద్దమనుషులు" కథకూడా ఈ రకంగానే నడిచిందికాని "అంతా మనవాళ్లే" కథఅంత నిర్దిష్టంగా లేదు చైర్మన్‌లో దౌష్ట్యం పాలు తక్కువే అని చెప్పాలి. ధర్మారావు ఏకైక పుత్రునివద్ద "ఇదంతా నీకోసం కాకపోతే ఎందుకురా" అన్నప్పుడు, ప్రభాకర్ తండ్రి నొదిలి వేరే నివసించినప్పుడు, సాధారణంగా ధర్మారావు పట్ల మనకు సానుభూతి కలుగుతుంది అలాగే అతని మురావాళ్లు నాగోజీరావు మొదలైనవారు, ప్రజల్ని ఎలా పీడిస్తున్నారో స్పష్టంగా చూపెట్టలేదు. వాళ్ళ వాళ్ళ జీవితాల్లో అక్కడక్కడ తెలివి తక్కువతనం అమాయకత్వం కనిపిస్తుంది. ధర్మారావు చేతి కీలుబొమ్మలుగా మాత్రమే గాని వారికి వేరే వ్యక్తిత్వం లేదు.

ఇక "ప్రజాసేవ" సంపాదకుడు రామదాసు పాత్రకూడ పేలవంగా ఉంది. ముందరనుంచి చైర్మన్‌గారంటే దేవుడనే నమ్మకం కలవాడు. పత్రిక నడపడానికి, ప్రెస్ కొనుక్కొందుకు ఆయనవద్ద సహాయం పొందాడు. అయ న్నెవరేనా పల్లెత్తుమాటంటే సహించలేడు "ప్రజాసేవ" నంతనూ చైర్మన్‌గార్ని పొగడటంకోసమే ఉపయోగించీ తనను తనే మోసగించుకున్నాడు. మొదట్లో మిగతా కౌన్సిలర్లతో తనకు భేదాభిప్రాయం వచ్చినా పత్రికాముఖంగా వెల్లడించడు. చైర్మన్‌గారిమీదుండే గౌరవంకొద్దీ, ఆయన చేసిన హత్యానేరాన్ని తనపై వేసుకుని జైలుకి వెడతాడు. ఈలోపుగా మిగతా కౌన్సిలర్ల బలవంతంమీద, వారి మాటల్ని విని ధర్మారావు, రామదాసు భార్యాబిడ్డల్ని అవమానించి వూళ్లోనుంచి సాగనంపుతాడు. శిక్షానంతరం



జంపనవారి "మేనరికం"లో వరలక్ష్మి, నారాయణరావు.

రామదాసుకి కూడ అటువంటి గతే పడుతుంది. ఇన్ని చేసినా, ధర్మారావు ఇతరుల చేతిలో పడిపోయాడని విచారిస్తాముగాని అతని దౌష్ట్యాన్ని మనం పూర్తిగా నిందించలేము.

ఆ తరువాత పత్రికాముఖంగా మురావాళ్ళపై రామదాసు సల్పిన దాడి కేవలం స్వార్థప్రేరితంగా కనిపిస్తుంది. తన నవమానించాడని, ధర్మారావుపై కోపం మాత్రమే రామదాసుచేత అలాచేయిస్తున్నట్లు కనపడుతుందిగాని మరే ఉన్నతాశయాలూ ఆట్టే కనపడవు ఇది నిజంగా కథలో బలహీనతగా ప్రత్యక్షమయింది.

పైగా, "అంతా మనవాళ్లే" లోలాగ గానుండా కథ ఆదికేశవుడు (దేవుడు) చుట్టూ తిరుగుతుంది. ప్రజల్ని కాకుండా దేవుడికే టోపీ వెయ్యటానికి ప్లాను వేస్తారు. మొదటిచిత్రంలో న్యాయస్థానం శిక్షిస్తే, ఈ చిత్రంలో ఆదికేశవుడే శిక్షిస్తాడు లంకబిందెలకోసం తవ్వుతూంటే కుండపంకాలి, అంతా మరణిస్తారు. ఇది కొంచెం అవాస్తవికంగా కనిపిస్తుంది. ప్రభాకర్ పాత్ర చాలా నిస్సారంగా కనిపిస్తుంది.

అయినా రేలంగి హాస్యం, సహాయకుల తత్వం మొదలయినవి చిత్రానికి ప్రత్యేకాకర్షణలు. ఈ చిత్రం బాగా డబ్బు చేసుకుంటే అది కేవలం తిక్కశంకరునిమహిమ, లేకపోతే ఆదికేశవుని మహిమ

—సత్యం, కాకినాడ.



# గ్రంథస్వీకారం

## శిక్ష

రచయిత ఎస్ ఆర్ చందూర్; వెల 2-0-0; ప్రతులకు కుబేరా ఎంటర్ ప్రైసెస్ లిమిటెడ్, 21, సుంకురామచెట్టి వీధి, మద్రాసు—1.

170 పేజీల్లో చెప్పబడిన ఈ కథను పెద్దకథ అనవచ్చును. ఎస్ ఆర్ చందూర్ గారు కథారచయితగా చెయ్యితిరిగినవారు. కనుక ఈ కథ కొసదాకా విడవకుండా చదివించేస్తుంది 'ఎంటర్ టెయిన్మెంట్ వాల్యూ' కలిగిన సినిమాకు ఉండవలసిన లక్షణాలన్నీ ఈకథలో ఉన్నాయి మూడు ప్రధాన స్త్రీ పాత్రలు. ఒకామె ఊర్మిళ; గొప్పనర్తక. రెండో ఆమె హారిణి; భర్తచేత అనుమానించబడి యిల్లు పోగొట్టుకున్న స్త్రీ. మూడో ఆమె వసంత; బీద కుటుంబంలో జన్మించి కొన్ని సిద్ధాంతాలకోసం పెళ్ళి చేసుకోకుండా ఆగిన యువతి ముగ్గురూ అందకత్తెలూ, మంచివాళ్ళూ. రెండు ప్రధాన పురుష పాత్రలు. ఒకడు హరిశ్చంద్రరావు; ఇతనికి వివాహం విషయమై కొన్ని సిద్ధాంతా లున్నాయి; మొదట్లో బీదవాడై స్వయంకృషివల్ల ధనవంతుడయ్యాడు; హారిణిని చేరదీసి, ఆమె కారుప్రమాదంలో చనిపోగా వసంతను పెళ్ళాడుతాడు. రెండోవాడు రాఘవరావు, వసంతఅన్న. ఇతనికి జీవితంపట్ల సిద్ధాంతాలున్నాయి; ఇతడి ఆత్మాభిమానం మొదలైన గుణాలచే ఆకర్షించబడి, బీదవాడైనా నర్తకి ఊర్మిళ ఇతణ్నే పెళ్లి చేసుకుంటుంది. వీరుగాక మరి ఇద్దరున్నారు. విఠల్ రావనే పెళ్ళిళ్ల పేరయ్య ఒకడూ, వైకుంఠరావనే పిచ్చిపుల్లాయ్ ఒకడూ. అందుచేత సినిమా కథకి కావలసిన హంగులన్నీ అమరి, ఈ పెద్దకథ కాలక్షేపానికి బాగా ఉపకరిస్తుంది

## వసంతోదయం

వార్డీ గులియా వ్రాసిన సోవియెట్ నవల కు డి గంగాధరరావుగారి అనువాదం. వెల 0-12-0; ప్రతులకు పీపుల్స బుక్ హౌస్, జాలయ్య మార్కెట్, గుంటూరు-1. ఈ నవల మూలరచన స్టాలిన్ బహుమతి పొందినది.

## అనార్కలి

ఖండకావ్యము, కవి దురిశేటి వేంకట రామాచార్యులు, వెల 1 4-0, ప్రతులకు ఫిరోజు మాధవాచార్యులు, అప్పారాయ గ్రంథమాల, నూజివీడు, (కృష్ణా) అనార్కలీ, సలీముల సుప్రసిద్ధ ప్రణయ విషాద గాథ ఈ ఖండకావ్యములో వర్ణితము.

## బృందావని

మచిలీపట్నంనుంచి డాక్టర్ కుప్పా వెంకటరామశాస్త్రిగారి సంపాదకత్వాన వెలువడే 'బృందావని' జయ ఉగాది ప్రత్యేక సంచిక ప్రతి మా కార్యాలయానికి చేరింది. ప్రయాగ, అనిసెట్టి, రాచకొండ నరసింహమూర్తి, ఏడిద కామేశ్వరరావు, మల్లికార్జున, సి నారాయణరెడ్డి ప్రభృతుల రచనలు యీ సంచికలో వున్నాయి ముఖపత్రంపై పైడిరాజుగారి సర్ రియలిస్టు చిత్రం ప్రకటించారు. వెల రెండు అణాలు.

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 180. కిరణాలు

ఎట్లుద్భవించును? అని వరంగలునించి పి. రాధాకృష్ణమూర్తిగారు అడుగుతున్నారు.




గాలి విద్యుద్వాహకము కాదు కాని పటములో సూచించిన ఆకారముగల గాజు బుడ్డీకి, 'కే', 'యా' అనే లోహపు కొడలను పొదిగిపెట్టి అమర్చి, 'ప' అనే గొట్టముగుండా గాలిని శక్తివంతములైన పంపుల ద్వారా తోడేస్తూ, 20000 వోల్టుల ఒత్తిడిగల బేటరీ (అంటే మొత్తము 20000 డ్రై బేటరీలను కలిపిన ఘటమాల)యొక్క కొసలను 'కే' 'యా' లకు కలిపిచూస్తే, ఒక స్థితిలో 'యా' నుంచి 'కే'కి ఒక వెలుగు తీగవలె విద్యుత్తు ప్రసరించును. గాలిని ఇంకా ఇంకా తోడేస్తూంటే ఈ వెలుగు తీగ ఎరుపై, బలిసి, (బుడ్డీలోపల) 'కే' దగ్గర తెగి, క్రమముగా 'యా'లోకి ముడుచుకొని బుడ్డీ అంతా కాస్తపైన నల్లనైనట్లు కనబడుతుంది. ఈ స్థితిలో 'కే'కి ఎదురుగానున్న 'మే' అన్న మేర అకుపచ్చనా, నీలమూ కలిసిన వెల్తురుతో మెరుస్తుంది. 'కే' అనే ఋణ ధ్రువమునుంచి బయల్వెడలే అదృశ్య కిరణముల తాకిడివల్ల 'మే' అన్న మేర మెరుస్తోందని ఊహించి, క్రూక్స అనే వైజ్ఞానికుడు ఆ కిరణాల తత్వము పరిశోధించాడు. అవి కిరణాలు కావు, ఎలక్ట్రానులనే ఋణ విద్యుత్కణాలని తేలినది. ఇవి ఋణవిద్యుదావేశములు కనుక 'కే' అను ఋణధ్రువమువల్ల వికర్షింపబడి 'కే' యొక్క ముఖతలమునకు లంబముగా పారిపోయి 'మే' దగ్గర బుడ్డీయొక్క గాజుకి తగిలి దాని మెరుపుకి కారణమౌతాయి.

రాంజను అను జర్మను వైజ్ఞానికుడు ఈలాంటి బుడ్డీకి పైన అంతటా నల్లని కాగితము అంటించి, పైన చెప్పిన 'మే' మెరుగును కప్పివేసినా, ఆ ప్రదేశమునుంచే అదృశ్య కిరణములు వస్తున్నవని, బేరియము ప్లాటినో సైనైడు పూసిన గాజుపలక మెరవడాన్నిబట్టి గ్రహించాడు. ఈ అదృశ్యకిరణములే X - కిరణములు

గొప్ప విద్యుత్పీడనమువల్ల అతి వేగవంతములైన ఎలక్ట్రానులు గాజూ, ప్లాటినమూ, మోలిబ్డినమూ వంటి ఘన పదార్థములకు తాకినప్పుడు ఆ తాకిడి గలిగిన చోటునుంచి X - కిరణములు పుట్టును. రాంజను తరువాతి వైజ్ఞానికులు 'కే' ను పుటాకారముగా తయారుచేసి, 'కే' యొక్క పుటాకార ముఖతలమునకు లంబముగా పారిపోయే ఎలక్ట్రానులు తగులుటకని '(ప' అనే ప్రతిధ్రువమును నిర్మించి, ఎలక్ట్రానుల తాకిడికి కరిగిపోకుండా '(ప' యొక్క రెండవ కొనను 'బా' అనే రాగిరేకు అమర్చి చల్లార్చి, '(ప' నుండి X కిరణములు నిరంతరాయముగా వెలువడుటకు వీలుకలుగజేసినారు. 'మ' అనేది ధన ధ్రువము. 'ర' అన్నది బుడ్డీలో గాలి తగ్గిపోయి ఉపిరి సలపక విద్యుత్ప్రసారము బుడ్డీలో ఆగిపోతే, 'కె మ ర దా' దారిని విద్యుత్తు ప్రసరించి, 'దా' దగ్గర 'కె' అనే ఋణధ్రువమునకు దాటుటవల్ల 'ర' లోని రాతి నారను వెచ్చబెట్టి అది పీల్చుకొని పట్టివుంచిన గాలిని బుడ్డీలోకి విడుదలచేసే సాధనము.

ఏతా వాతా, "X - కిరణములు వేగవంతములైన ఎలక్ట్రానుల తాకిడి తగిలిన చోటునుంచి పుట్టును" అని తేలినది. X - కిరణోత్పత్తికి, ఎలక్ట్రానులు సమృద్ధిగా నిచ్చేసాధనమూ, వాటికి వేగమునిచ్చే విద్యుత్పీడనమూ, వాటి తాకిడికి నిలిచే ఘనపదార్థమూ అవసరము. ద్రవాలు వాడితే బుడ్డీలోని గాలి తోడేస్తున్నప్పుడు ద్రవాలు వాయువులుగా మారిపోతాయి. పాదరసమును వాడిచూచినారు కాని కిరణోత్పత్తి సాధనములో పాదరసము అనుకూలము కాదు.




## చిత్రప్రశ్నలకు జవాబులు

—చంద్రుడు భూమి ఆత్మప్రదక్షిణము చేసుకొంటున్నాడు కాని భూమిచుట్టూ




తిరిగి రావడానికి పట్టే రెండువారాలకాలములోనే ఒకసారు తనచుట్టూ తిరుగుతున్నాడు. పటములోని బాణము గమనించండి. అది

'భూ' చుట్టూ వర్తులాకారంగావున్న గిరిలో తిరుగుతూ, ఒకమారు చుట్టూ తిరిగి వచ్చే కాలములోనే తనచుట్టూ తాను ఒకమాటు తిరుగుతోంది. అందువల్ల 'భూ'నించి చూసి నప్పుడు ఎప్పుడూ బాణముఖమే కనబడు తుంది. ఈరీతిగానే చంద్రుడు భూమి చుట్టూనూ, బుధగ్రహముసూర్యుడిచుట్టూనూ తిరుగుతూన్నారు. బుధగ్రహానికొకపార్శ్వం ఎప్పుడూ సూర్యుడి ఎండలో మండి పోతూంటే, ఇంకొకపార్శ్వం హిమవంతం లాగ చల్లగా వుంటుంది. అలాగే చంద్రుడి




పార్శ్వం మనకి కనిపించేదే ఎప్పుడూ భూమి వైపు తిరిగి ఉంటుంది.

—అగ్నిపర్వతబిలాలు, వ్యాసము అడుగు మొదలు ఏడుమైళ్ళదాకా వున్నవి కనబడ్డాయి. ఇల్లాంటిది రోమునగరానికి 16 మైళ్ళదూరంలో ఒకటి ఉంది. అది ఇప్పుడు కొండగోడలతోవున్న పెద్దసరస్సు.

—చంద్రుడు సరిగ్గా గోళాకారంలో లేడు. చంద్రుడు, మన భూమి ద్రవరూపములో ఉండిన కాలములో భూమినించి వేరైన 'బిందువు'. ఈ బిందువులోని ద్రవము భూమి ఆకర్షణవల్ల, పటములో చూపినట్లు గోళాకారముగా కాక కోడి గుడ్డు ఆకారముగా తయారై ఆ స్థితిలోనే చల్లారి చంద్రుడైపోయింది. భూమినుంచి చూస్తే మట్టుకు చంద్రబింబపు అంచు గుండ్రంగానే కనబడుతుంది.

—ప్రతీ రేడియోకేంద్రమూ, రెండు మూడు రకాల మీటర్లమీద ప్రసారము చేస్తుంది నిజమే. ఒకే మీటరుమీద చెయ్యకూడదా? అంటే, చెయ్యవచ్చును. అప్పుడు మరి రెండువిధాల ప్రోగ్రాములు ప్రసారించడానికి వీలుండదు. చెన్నపట్నమునించి తెలుగులోనూ అరవములోనూ కూడా ప్రోగ్రాములు ఒకే కాలములో ప్రసారము చెయ్యాలి. మరి రెండు వేర్వేరు మీటర్లలో ప్రసారించడము అనుకూలము కాదా?

హెచ్చు మీటర్లలో చేసిన ప్రసారము భూమిని అంటి పోకి, ప్రసారకేంద్రానికి దగ్గరగా ఉన్న చోట్లకే అందుతుంది. కనుక ప్రాదేశిక ప్రాముఖ్యతగల ప్రోగ్రాముల్ని హెచ్చుమీటర్లలో అనగాదీర్ఘతరంగప్రసారములో పెట్టుకుంటారు. చిన్న తరంగ ప్రసారము ఆకాశములోగల అయనావరణాన్ని తగిలి పరావర్తనమై, మళ్ళీ భూమికి అందగలదు. కనకను దూరదేశాలనుంచి వినుట కుద్దేశించబడిన ప్రసారము చిన్న తరంగములో ప్రసారిస్తారు.

—రైలు నడుస్తూన్నప్పుడు గుప్పుగుప్పుమని పొగవదుల్తుంది. ఫ్యాక్టరీ అలాగవదలదు నిజమే. రైలు ఇంజను చక్రాలను తిప్పే అడుకమీ(?)తో పొగని పెకినెట్టే ముషల కొన్ని కలుపుతారు. అందువల్ల చక్రాలు తిరుగుతూంటే పొగకూడా గుప్పుగుప్పుమని పోతుంది. రైలు స్టేషనులో ఆగినప్పుడు చక్రాలు తిరగవు, పొగకూడా గుప్పుగుప్పుమనిరాదు. రైలు నడుస్తూన్నప్పుడు రైల్లో వారికి గుప్పుగుప్పుమన్న చప్పుడు వినబడక పోయినా, గట్టుపక్కన నిలబడ్డ వారికి వినబడుతుంది అయితే రైలు ఏదైనా స్టేషను చేరువకు వచ్చినప్పుడు పొగ గదికీ చక్రాల తిరుగుడుకీ గల సంబంధము తప్పించేస్తారు. అందుకే బుస్సుమనేగాని గుప్పుగుప్పుమని రాదు రైలు ఏస్టేషనులోకైనా. రైలువేగము హెచ్చుతున్నప్పుడు ఈసంబంధము తప్పక వుంటుంది. అంటే గుప్పుగుప్పుమని తీరాలి.

—క్షయవ్యాధికి మూలకారణము ఆవ్యాధిని తెచ్చే సూక్ష్మజీవులు మానవుల ఊపిరితిత్తులూ, ఎముకలలోని మూలుగూ, లలో చేరి, పెరగడమే. చెదపురుగులు క్రమంగా తినేసినట్టే ఈక్రిములు ఎముకనీ, ఊపిరితిత్తునీ తినేస్తాయి.

క్షయవ్యాధితో బాధపడేవారికి రెండు ఊపిరితిత్తులకూ ఈక్రిముల దెబ్బతగలకపోతే దేనికి తగిలిందో దాన్ని కొన్నాళ్లు ఊరుకోబెట్టడానికి గాలిని ఊపిరి తిత్తికీ, దాని పొరకీ నడుమకి పంపుచేస్తారు. అప్పుడు రెండో ఊపిరితిత్తికి అపాయము ఉండదు. ఈలోపుగా రెండోది విశ్రాంతివల్ల బలపడవచ్చును.

—ప్లాస్టిక్కులు రసాయన పదార్థాల వంటవల్ల తయారుచేస్తారు. లోహమూ, రాయీ, కర్రా మొదలైన వాటితో చేసిన వస్తువులు వంచినా, నొక్కినా, మళ్ళీతిరిగి యధారూపము పొందుతాయి. ఈ ప్లాస్టిక్కులు ఒక ప్రత్యేక ఉష్ణోగ్రతలో నున్నప్పుడు వాటిని మైనమును లాగ ఏరూపంలో కావలిస్తే ఆరూపంలోకి తెచ్చుకోవచ్చు. చల్లారిన తర్వాత మళ్ళీ గట్టిపడి ఆరూపాన్ని నిలుపుకుంటాయి. కనకనే ఫౌంటెన్ పెన్నులూ, పలకలూ ఏవికావలిస్తే, అవి తయారు చేసకోవచ్చు. ప్లాస్టిక్కులను ఒక విధంగా లక్కతో పోల్చవచ్చు.

—ఉదయాస్తమయాల్లో సూర్యుడి నుంచి భూమిని రాసుకుంటూన్న వచ్చి మనకి, అందే తెల్లని వెల్తురులోని నీలికిరణాన్ని భూమిమీద గాలిలో తేలియాడే ధూళికణాలు విరజిమ్మేస్తాయి. చివరకి మన కంటికి చేరేది ఎర్రని వెల్తురు కనక సూర్యచంద్ర బింబాలు ఎర్రగా కనబడతాయి.

—భూమి పర్వత శిఖరాలమీదా, వినగుల వీపులమీదా, భూదేవి భుజాలమీదా, ఆదిశేషుడి పడగలమీదా అనుకుని ఉన్నదన్న మాట వైదికవుల ఊహాస్వప్నము. భూమిచుట్టూ ఎంత తిరిగినా ఇవేవీ కనబడవు. ★



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madra